# అష్టావక్రగీత

**ముక్తిమిచ్ఛసి చేత్తాత విషయాన్విషవత్త్యజ ।**
**క్షమార్జవ దయా తోష సత్యం పీయూష వద్భజ ॥ 1 ॥**

ఓ శిష్యా ...! సర్వఅనర్థములను తొలగించి, నిత్యపరమానంద సుఖమును గూర్చునట్టి ముక్తి యందు కోరిక కలదేని అనర్థములను కలిగించునటువంటి విషమునెట్లు పరిహరించెదవో, ఆ విధముగనే సర్వ అనర్థములకు మూలమగు దేహాదివిషయములయందు ఆసక్తిని విడిచి అంతర్ముఖుడవగుము. అనగా అహం అను (నేను, నాది) అధ్యాసను విడువుము అని అభిప్రాయము. మరియు క్షమ, ఆర్జవము, దయ, సంతోషము, సత్యము, అను వీనిని అమృతము వలె స్వీకరింపుము.

దేహము మొదలకొని అహంకారము వరకు గల దృశ్యములన్నియు విషయములే. కాబట్టి విషప్రాయములగు యీ విషయములందు ఆసక్తిని విడువుము. బాహ్యపదార్థములయందు ఆశలేకుండా వుండుటయే "దయ" యనబడును. ఇట్టి బాహ్యేంద్రియ నిగ్రహమునలవరచుకొని, క్షమా, అర్జత, ఆదిగా గల అంతరింద్రియ నిగ్రహమును శమమనభ్యసింపుము. క్షమ, ఆర్జవ, తోష, సత్యములు ఆత్మజ్ఞధర్మములు -

క్షమమనగా సర్వసహనము. సకల వికారములకు సాక్షియగు ఆత్మను సదా భావించుటచేత సర్వమును సహించవచ్చును. సర్వాధిష్టానత్వము ఆత్మధర్మము.

అర్జతయనగా అవిద్యారూపమగు వంచనలేకుండుటయే. అనగా మాయా సంబంధమైన యేవికారమును కలుగకుండుట.

దయయనగా నిర్హేతుకముగా యితరుల మేలును కోరుట. ఇదియును ఆత్మధర్మమే.

తోషమనగా సదా ఆత్మసుఖము. సర్వదా ఆనందమయుడై యుండుట. ఇదియునూ ఆత్మ స్వరూపమే.

సత్యమనగా కాలత్రయమునందును మార్పు కలుగని ఆత్మయే.

సర్వసిద్ధులకు కారణమగు అమృతమును ఎంత ప్రేమతో స్వీకరించెదవో అంత ప్రీతితో యీ క్షమార్జ వాదులను స్వీకరింపుమని శమదమాది సాధన చతుష్టయ సంపన్నుడగు శిష్యునకు మహాత్ముడగు మునీశ్వరుడు ముక్తి సాధనమును ఉపదేశించు చున్నాడు.



వ్యాఖ్యాత : యర్రం చంద్రశేఖరం

ఈ ప్రథమ శ్లోకము, యీ గ్రంథములో వివరించిన విషయములన్నింటికన్న కీలకము, సర్వవేదాంత సారమై నాయకమణి వలె అలరారుచున్నది.

# అష్టావక్ర గీత

వ్యాఖ్యాత

యర్రం చంద్రశేఖరం

# ★★★ అష్టావక్ర గీత ★★★

**"రికాబ్ మై చరణటె బ్రహ్మకా ఉపదేశ్"**

**"పునరపి జననం, పునరపి మరణం"**

పైన ఉదహరించిన వాక్యము మానవుని జనన మరణములకు సంబంధించినది. ఇది మానవ జీవితములో సహజముగా జరుగు ప్రక్రియ. ఈ విచిత్ర వలయమునుండి విడివడి జీవితమును తరింపజేసుకొనవలసిన అవసరము మానవులకు ఎంతగానో ఉన్నది.

ఇందులకు అవసరమగునది "వేదాంత విద్య". దీని ద్వారా మనము "బ్రహ్మజ్ఞానమును" పొందగలము. దీనిని పొందినగాని మానవుడికి జన్మరాహిత్యము అనగా మోక్షములభించదు.

దీని నిరూపణ నిమిత్తము శ్రీ మచ్ఛంకరభగవత్పాదుల వారు వివేక చూడామణిలో

***"నయోగేన నసాంఖ్యేన కర్మణానోన విద్యయా !***
***బ్రహ్మ త్మైకత్వ బోధేన మోక్ష స్సిద్ధ్యతి నాన్యధా !!***

చెప్పియున్నారు. సర్వ విద్యలకు జ్ఞాన విద్యయే శిరోమణియని మహాత్ములు చెప్పియున్నారు. నిశ్చయించియున్నారు.

శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో

***"రాజ విద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమం!***
***ప్రత్యక్షావగమం సుసుఖం కర్తుమవ్యయం !!"***

ప్రబోధించినారు 'ఈ బ్రహ్మజ్ఞానవము నకల విద్యలలో ఉత్తమోత్తమమైనది. రహస్యములలో శ్రేష్ఠమైనది. ఎంతో పవిత్రమైనది, ధర్మయుక్తమైనది, అభ్యసించుటకు మిక్కిలి సులభతరమైనది. నాశనములేనిది'. యిది అని.

ఈ బ్రహ్మజ్ఞానము అనేక జన్మలలో ఒనర్చిన సుకృత పరిపక్వత వలన మాత్రమే ప్రాప్తించగలదు. ఈ విషయము శాస్త్రకారులు చెప్పుటలో ఎంతో యదార్థమున్నది.

ఈ బ్రహ్మవిద్యకు అధికారులు, ఉత్తమ, మధ్యమ, కనిష్ఠులని మూడు వర్గములుగా ఉన్నారు. వీరిలో ఉత్తమాధికారుల సంఖ్య అత్యల్పము, కనిష్ఠాధికారుల సంఖ్య అతి విస్తృతము దీనిని శ్రీ కృష్ణ భగవానులు భగవద్గీతలో యీ క్రింది శ్లోకము ద్వారా వ్యక్త పరచినారు.

*మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే !*
*యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్వతః !!"*

వేలకొలది మనుష్యులలో ఒకానొకడు పూర్వ జన్మ పుణ్య విశేషముచే ఆత్మజ్ఞాన సిద్ధి కొరకు ప్రయత్నము చేయుచున్నాడు. అట్లు ప్రయత్నము చేయుచు జ్ఞాన సిద్ధిని పొందిన వారలలో సహితము ఏ ఒక్కడో నన్ను యదార్థముగా తెలిసికొనుచున్నాడు.

ఈ కారణముగా కనిష్ఠవర్గములోని వారలకు విక్షేప, ఆవరణ, రూప మల నివృత్తి దుస్సాధ్యము.

పైన ఉదహరించిన అధికారులలో ఎవరికి విక్షేప, ఆవరణ, రూప మలములు నష్టమగునో అట్టి వారలకు ఈ జన్మయందే సర్వోత్తమ సాధనమగు సద్భావము కలిగి, బ్రహ్మజ్ఞానప్రాప్తి లభించును. తదితరులకు యిది కడు దుర్లభము.

అంతేకాకుండా ఎవరైతే బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడగు సద్గురువును ఆశ్రయించి "తత్త్వమసీ" యిత్యాది వాక్యరూపమహామంత్రములను విశ్వాసముతోవిని, మననముచేసి నిధిధ్యాసములో ఉండుట వలన కలిగిన పరమశాంత మనస్కులగుదురో వారేఅతిశీఘ్రముగా బ్రహ్మజ్ఞానులగుదురు.

అట్టి బ్రహ్మజ్ఞానమునకు జనకమహారాజు ఉత్తమోత్తమాధికారి. ఆయనకు గుర్రము నెక్కుచు ఒక రికాబులో కాలుపెట్టి రెండవ రికాబులో కాలుపెట్టునంత స్వల్పకాలములో బ్రహ్మ సాక్షాత్కారము కలిగినట్లు ఈ క్రింది కథా సంగ్రహమువలన విశదమగుచున్నది.

# కథా సంగ్రహము

జనకమహారాజు మిథిలాధీశుడు. అత్యంతబుద్ధికుశలుడు. రాజ కార్యతత్పరుడు. సద్గుణమూర్తి. రాజశ్రేష్ఠుడు. అతడు జనహర్షముగా రాజ్యపాలనచేయుచుండెడివాడు.

ఒకరోజు తన రాజసభయందు కులగురువు. పరమ ఆస్తికుడునుయైన బ్రహ్మణపుత్రుడు శాస్త్ర పఠనము చేయుచు, ప్రసంగవశమున "గుర్రపు రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశము జరుపవచ్చును" అని శాస్త్రములోని కథాపఠనమున వక్కాణింపగావిని రాజు అత్యంతాశ్చర్యచకితుడై ఆ బ్రహ్మణ పుత్రునిట్లు ప్రశ్నించెను "స్వామీ రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశమగునను శాస్త్ర వాక్యము. సత్యమా...? లేక కల్పితమా...?"

"ఓ మహారాజా! మహాపవిత్రమైన యీ శాస్త్ర వాక్యము యథార్థము కాకపోవునా...? ఆ విషయములో మీరేమాత్రము శంకింపవలదు" అని సమాధానమిచ్చినాడు.

"బ్రాహ్మణోత్తమా....! నాబుద్ధికి ఈ శాస్త్రవాక్యము అసంభవమని తోచుచున్నది. ఆ వాక్యము యథార్థమే అయినచో యిప్పుడే నాఅశ్వమును రప్పించెదను. ఆగుర్రమును నేనెక్కునప్పుడు ఒకరికాబులో కాలుపెట్టి, రెండవరికాబులో కాలుపెట్టునంతలో నాకు బ్రహ్మోపదేశమొనరించి, యీ శాస్త్రవాక్యము యొక్క ప్రతిపాదనము చేయుము" అని వక్కాణించినాడు.

"ఓ మిథిలాధీశా...! ఈ శాస్త్రవాక్యమెంతమాత్రము అసత్యముకాజాలదు. అయినను దాని సత్యత్వమును ప్రతిపాదించు సామర్థ్యము నాకు లేదు" ఎంతో వినయముగా ఆవిప్రపుత్రుడు. సమాధాన మిచ్చినాడు.

"విప్రోత్తమా....! నీవు విద్వాంసుడవు. నీకు అట్టి సామర్థ్యములేనిదే ఆ శాస్త్రవాక్యము సత్యమని ఏ విధముగా చెప్పుచున్నావు...? ఆవశ్యకమగు నీ శాస్త్రోక్తి సిద్ధింపనిచో యిదికేవలము కల్పనా రచితమై యుండును. ఈ వాక్యము యొక్క సత్యత్వమును ప్రదర్శింపనీవు అశక్తుడవైనచో యీ వాక్యమును ఖండింపుము. ఇది సాధ్యమగునది కాదని ఒప్పుకొని గ్రంథమునుండి తొలగింపుము" పలికినాడు మహారాజు.

మహారాజునకు కోపము వచ్చినదని గ్రహించిన విప్రకుమారుడు వినయముగా "రాజా...! ఈ శాస్త్రవచనము యొక్క సత్యత్వములో ఎటువంటి సంశయములేదు. దీనిని నేను ఖండింపజాలను" పలికినాడు

ఆ బ్రహ్మణకుమారుని మాటలు మహరాజునకు యెంతో క్రోధమును కలిగించినవి. వెంటనే అతనిని చెరసాలలో బంధింపజేసినాడు. పిమ్మట తన రాజ్యములోని పండితులను, తత్త్వవేత్తలను, బ్రాహ్మణులను తన సభకు రప్పించి శాస్త్రప్రసంగము చేయుచు యీ క్రింది విధముగా పలికినాడు.

"ఓ విద్వజ్జనులారా....! ఈ శాస్త్రమందు రికాబులో కాలుపెట్టి అశ్వమునధిరోహించునంతలో బ్రహ్మోపదేశమగునని వ్రాయబడియున్నది. ఈ వాక్యము యథార్థమైనదేనా" అని ప్రశ్నించినాడు.

ఆ ప్రశ్నకు సమాధానముగా "సత్యమే...! సత్యమే..!" అని సర్వ విద్వాంసులు పలికినారు.

"అయినచో యిదిగో... అశ్వము సిద్ధముగా ఉన్నది. ఈ శాస్త్రవాక్యము యొక్కసత్యత్వమును ప్రత్యక్ష ప్రమాణముగా రుజువు చేయుటకు మీలో సమర్థులయినవారు సిద్ధపడగలరు. లేదా...? ఈ వాక్యమును ఖండించుడు" పలికినాడు.

ఆ మాటలు వినిన విద్వాంసులందరూ తమ అశక్తతను తెలుపుతూ, శాస్త్రవచనమును ఖండించుటకు మాత్రము ఎవ్వరునూ అంగీకరించలేదు.

ఆ కారణముగా కోపోద్రిక్తుడైన జనకమహారాజు ఆ విద్వజ్జనులనందరినీ విచక్షణారహితముగా కారాగారములో బంధింపజేసినాడు. అంతేకాకుండా తమ నగరములో ప్రవేశించు బ్రాహ్మణులనందరినీ తన వద్దకు రప్పించుకొనుచు వారిని కూడా పూర్వము వలె ప్రశ్నించుచు. వారి అశక్తతకు కోపించుచున్నవాడై వారందరినీకూడా చెరసాలలలో బంధించసాగినాడు.

జనకమహారాజు యొక్క యీ దుర్భర భయంకర ప్రవర్తనము అన్నిదేశములకూ వ్యాపించినది. కాలక్రమములో బ్రాహ్మణులు, విద్వాంసులు మిథిలానగరమునకు వచ్చుటకు జంకుతూ, ఆదేశమునకు వచ్చుటయే మానివేసినారు. ఆ విధముగా కొంతకాలము గడిచిపోయినది.

భాగ్యవశమున ఒకానొక రోజు అష్టావక్రముని అను మహాశయుడు మిథిలానగర సమీపమునకు వచ్చి మార్గాయాసమువలన నగరము వెలుపల

ఒక వృక్షము క్రింద విశ్రమించెను. అష్టావక్రమహాముని బ్రహ్మజ్ఞాని. శారీరకముగా మాత్రము అశక్తుడు ఎనిమిది వంకరలు తిరిగినశరీరముతో వికృతరూపుడుగా నుండినవాడు. అంతకు పూర్వమే యిరువురు బ్రాహ్మణులు ఆ వృక్షము క్రిందకూర్చొని సేదతీర్చుకొనుచుండిరి.

వారు ఆ మహామునిని చూచి "అయ్యా..! మునివరా.. మీరు ఎటువెళ్ళుచున్నారు..? సమీపమునగల యీ నగరమునకు వెళ్లనిచ్ఛగించుచున్నారాఏమి..?" అని ప్రశ్నించినారు.

"అవును వెళ్లెదను" సమాధానమిచ్చినారు మునివర్యులు. అప్పుడు ఆబ్రాహ్మణులు "మునివరా..! మా మాటలను మన్నించి మీరెప్పుడునూ ఆ నగరమునకు వెళ్ల వలదు కారణమేమన..? ఈ నగరపాలకుడగు జనకమహారాజు అత్యంత క్రూరుడు, దురాగ్రహముగలవాడు. అనేకులైన బ్రాహ్మణులను విద్వాంసులను నిర్ధాక్షిణ్యముగా చెరసాలలో ఉంచినటువంటివాడు. దౌర్భాగ్యవశమున క్రొత్తగా ఏ బ్రాహ్మణుడైనా, విద్వాంసుడైనా యీ నగరములో ప్రవేశించునెడల "రికాబులో కాలుపెట్టినంతలో బ్రహ్మోపదేశమగు" నని శాస్త్రవచనమున్నది. కావున ఆ శాస్త్రవచనము యొక్క సత్యత్వమును ప్రత్యక్షముగా రుజువు చేయమని ఆజ్ఞాపించుచు, రుజువు చేయని యడల వారి నందరనూ వెంటనే కారాగృహములో బంధించుచున్నాడు." అని విన్నవించినారు సవినయముగా.

అప్పుడు అష్టావక్రమహాముని ఒక్కక్షణము ఆలోచించి , ఆపథిక బ్రాహ్మణులతో నిట్లనియె " నేను నడవలేని అసమర్థుడను నన్నొక డోలికయందు కూర్చుండజేసి జనకమహారాజు సమ్ముఖమునకు తీసుకొని పొండు. ఆ శాస్త్రోక్తవచనములయొక్క సత్యతను ప్రతిపాదించి, చెరసాలలో బంధించబడియున్న విద్వాంసులనందరను విడిపించెదను"

మహామునియొక్క గంభీరవాక్యములను విని, ఈ మునీశ్వరుడు విద్వాంసుల దుఃఖమును తప్పక నివారింపగలడని నిశ్చయించుకొని వెంటనే ఒకడోలికను యేర్పాటుచేసి దానిపై ఆ మునీశ్వరుని కూర్చుండజేసి, తాము స్వయంగా ఆ డోలికను మోసుకొనిపోయి జనకమహారజు సమక్షమున సభాస్థలిలో ఆమునీంద్రుని కూర్చుండబెట్టిరి

జనకమహారాజు అష్టావక్రమునీశ్వరుని తేజోమయంముఖ మండలమునుగాంచి, చకితుడైతన ఆసనమును వీడి ఆతనికి సాష్టాంగ నమస్కారమొనరించి, లేచి నిలబడి రెండు చేతులు జోడించి, వినయముగా "ఓ మునిచంద్రా...! తమరు యిక్కడికి వచ్చినకారణమేమిటో సెలవియ్యగలరు. నన్ను ఆజ్ఞాపించగలరు" అని ప్రార్ధించినాడు.

" ఓ రాజా...!ఏమపరాధముచేసినారని నీవు అనేకమందివిద్వాంసులను కారాగృహబద్ధులచేసినావు...?" అని ప్రశ్నించినాడా మునీశ్వరుడు.

"మునీశ్వరా..!రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశమగునను శాస్త్రవాక్యమును ప్రతిపాదింప వీరు అసమర్ధులగుటంజేసి, యీ శాస్త్రవచనము యొక్క యదార్ధమును వీరలు ప్రదర్శింపలేక పోయినందులకు నేను క్రోధితుడనై యీవిధముగా వారినందరనూ బంధించినాను" అని విన్నవించెను.

"ఓ రాజా...! నీతర్కము న్యాయసమ్మతముకాదు. శాస్త్రపాదమును ప్రతిపాదించలేకపోయిన కారణమున అదికల్పితమని నీవు నిర్ధారణ చేయకూడదు. "రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశమగు" నను శాస్త్రవచనము మిథ్యాకాదు. అందలిప్రతిఅక్షరమునున్నూ సత్యమే! నేనుప్రతిజ్ఞచేయుచున్నాడను. దానిని నిరూపించెదను." మునీశ్వరుడు దృఢముగా పలికినాడు.

అప్పుడు జనకుడు "ఓ...మునీంద్రా?...! మీ ఆజ్ఞఅయిన యెడల అశ్వమును రప్పించెదను. నాయందు సంపూర్ణ కృపతో యీ శాస్త్రవచనప్రకారము బ్రహ్మోపదేశము చేయుడు. శాస్త్ర వాక్యము యొక్క సత్యతను ప్రతిపాదించుడు. నమస్కారపూర్వకముగా మిమ్ములను ప్రార్ధించుచున్నాడను" విన్నవించెను.

"ఓ.. రాజా...! నీ శుభ భావమునకు నేను నీపట్ల అతి ప్రసన్నుడనైనాను. 'బ్రహ్మజ్ఞాన రూప పవిత్రోపదేశము అపాత్రులకొసగకూడదని నీవెప్పుడూ వినయుండలేదా...? ఆ విధముగా అపాత్రులకొసగినయెడల కించిత్తయినను లాభములేదు. కుమారా..! రాజపుత్రా! బ్రహ్మోపదేశము పొంద నీకభిలాషకలదేనినాయెడల పూర్ణమగు శ్రద్ధవహింపుము. ముందుగా కారాగృహబద్ధులైయున్న విద్వాంసులనందరనూ విడుదలచేసి. పిమ్మట నీవు అశ్వారూఢుడవై నాతో ఆరణ్యమునకు రమ్ము. అప్పుడు యేకాంత నిర్జనస్థలమందు నీకు బ్రహ్మోపదేశమొనర్చెదను'. అని పలికినాడాముని.

అష్టావక్రముని మాటలలోని దృఢనిశ్చయమువినినంతనే జనకమహారాజునకు ఆ విషయమై అత్యంతాసక్తి కలిగెను. కారాగృహబద్ధులైయున్న విద్వాంసులనందరినీ తక్షణమే విడిచి పెట్టుటకు రాజు అజ్ఞాపించెను. పిమ్మట తాను అశ్వారూఢుడై ఆ మహామునిని శ్రేష్ఠమగు పల్లకిలో కూర్చుండబెట్టి అమాత్యాదులతోడను, సైనికాధికారులతోడను, కొందరు ప్రముఖపౌరులతోడను, వనమునకు స్వారి వెడలెను. ఆవిధముగా బయలుదేరిన వారందరునూ అరణ్యమునందు ఒక విశాలవటవృక్షచ్ఛాయలో విశ్రమించినారు. అంతట తమతోవచ్చిన పరివారమునంతనూ నగరమునకు పంపించి వేయవలసినదిగా మునీశ్వరుడు జనకమహారాజునకు ఆజ్ఞాపించగా, వారలసందరునూ త్రిప్పిపంపెను. అంత మునీశ్వరుడును, రాజును మాత్రమే అక్కడ మిగిలిపోయినారు. జనకమహారాజు మునీశ్వరుని ఆజ్ఞతో ఒకరికాబులో కాలుపెట్టి గుర్రము నధిరోహించుటకుద్యుక్తుడాయెను. ఆ సమయమునందుముని "ఆగుము ధైర్యముతోనుండుము". అని రాజునకు సంజ్ఞచేసి "ఓ రాజపుత్రా..! నీరెండవ చరణమును యెత్తకమునుపు నాప్రశ్నలకు బదులిమ్ము " అనిపలికెను.

"ఆజ్ఞాపింపుము మహాత్మా" రాజు సవినయముగా పలికెను.

''రాజా...! శాస్త్రములో ''రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశమగును" అను వాక్యమొక్కటియే లిఖించబడియున్నదా...? లేక యింకనేమైనయితరవిషయములు లిఖించబడియున్నవా...?'' ప్రశ్నించినాడుముని.

"అన్యవిషయములుకూడా అనేకముల వ్రాయబడియున్నవి స్వామీ!" సమాధానమిచ్చినాడు రాజు.

''బ్రహ్మజ్ఞానోపదేశము పొందుటకు ఒకరిని గురువుగా ఏర్పరుచుకొనవలెనని ఆశాస్త్రమందు వ్రాయబడియున్నదా..?లేదా..?" ప్రశ్నించానాడు ముని.

"ఆహా..!మహాత్మా..!గురువు అవశ్యముగానుండవలయుననియే శాస్త్రములో నిర్ధారించబడియున్నది." రాజు సమాధానమిచ్చినాడు.

"అయినచో రాజా..!నీవు నన్నుగురవుగా స్వీకరించకనే నానుండి ఉపదేశమును పొందగోరుచున్నావా ఏమి?"

"అటులకాదు మహాత్మా..! శాస్త్రవిధిపూర్వకముగా ఉపదేశముపొంద ఉత్సుకుడనైయున్నాను. తండ్రీ...! మిమ్ములనే నాగురువుగా యిపుడే నిర్ణయించుకొనుచున్నాను" ప్రత్యుత్తరమిచ్చినాడురాజు.

"రాజా..! ఉపదేశమొందునపుడు గురుదక్షిణ సమర్పింపవలెనను విధానము శాస్త్రములో వ్రాయబడి ఉన్నదా..?"

"మహాత్మా..!శాస్త్రనుసారముగనే యీ క్షణమందే నాయొక్క తను, మనో, ధనములు మీచరణ కమలములయందర్పించుచున్నాను. నాయందను గ్రహముంచి యిపుడునాకు బ్రహ్మోపదేశమొనర్చుడు." ప్రార్థించినాడు రాజు.

తరువాత ముని ఆజ్ఞను పొంది రాజు రికాబులో కాలుపెట్టినాడు. వెంటనే ముని అదృశ్యుడై దూరముగా పోయిఒక గుహలో దాగియుండినాడు.

రికాబులో పెట్టిన కాలు అటులనే ఉంచి, తరువాత ఆజ్ఞకు ఎదురుచూచుచు కదలక. మెదలక, నిలువబడి, ముని కనుపించక నిశ్చేష్టితుడై యుండెను.

సూర్యాస్తమయ సమయమైనను జనకమహారాజు నగరమునకు తిరిగి రాకుండెను.. అప్పుడమాత్యులు, సేనాధిపతులందరును అత్యంతచింతాక్రాంతులై ఆ క్షణమందే వడి, వడిగా వనమునకుబోయిరి. ఆవిధముగా వెళ్ళిచూడగా ఒకవిశాలవృక్షసమీపములో మనీశ్వరుని గొని పోయినపల్లికి మాత్రముండెను. మునీంద్రుడు ఎచ్చటను కనుపించకుండెను. జనకమహారాజొకకాలును గుర్రపురికాబులో ఉంచి చైతన్యరహితమగు ప్రతిమవలె నిశ్చేశ్చితుడై ఉండెను. ఆదృశ్యమును చూచిన ఆ పరివారమంతయు భయక్రాంతమయ్యెను. ప్రధానామాత్యుడు త్వరితగతిని రాజునొద్దకు పోయెను. కాని రాజు అతనిని గమనించనేలేదు.

ఆ ప్రధానామాత్యుడు తన రెండుచేతులు జోడించి" మహారాజా! యీ స్థితికి కారణమేమి..?" అని ప్రశ్నించెను.

జనకమహారాజు ఏమాత్రము కదిలియుండలేదు. సమాధానమిచ్చి యుండలేదు. అప్పుడు పరిస్థితిని గమనించిన ఆ పరివారమంతయూ మునీశ్వరుడే రాజునకెద్దియో మంత్రప్రయోగము చేసియుండునని తలచినారు. ఆ మునికోసరము కొంతతడవు వెదికినారు. కాని ఆమునియెచ్చటను

కనుపిచలేదు. పరివారమంతయూ నిరాశకులోనై రాజును పల్లకిలోకూర్చుండజేసి నగరమునకు గొనిపోయి, రాజమందిరములో ఒక ఉత్తమశయ్యపై పరుండబెట్టినారు. తరువాత మేరు,ధీరులైన, ఉత్తమాశ్వికులను రప్పించి, వనములో మునిని వెదికి తేవలసినదిగా అజ్ఞాపించి తక్షణమే పంపించినారు. మునిలేకుండా తిరిగిరావలదనికూడా కఠినముగా శాసించినారు. జనకమహారాజును శయ్యపై పరుండబెట్టినపుడు ఏ స్థితిలో ఉండెనో తర్వాతకూడా కాళ్ళుచేతులు కదలకుండా ఆస్థితిలోనే ఉండెను. ఒక్కమాటకూడా అతని నోటినుండి వచ్చియుండలేదు. జలపానము లేదు. అన్నముగ్రహించలేదు. సమయము గడిచిపోవుచుండెను. మహారాజుయొక్క యీ స్థితికి రాణి తక్కిన పరివారము అత్యంత శోకనిమగ్నులైనారు. ఈ వార్త క్రమముగా సర్వత్రా వ్యాపించి నగరమంతటనూ ప్రజలలో హహకారము పుట్టినది. ఆరాత్రి అంతయూ అతి దుఃఖములో గడిచి సూర్యోదయమాయెను. మునీశ్వరుడు రాడాయెను.మరల సూర్యాస్తమయసమయమునకు ఒక సైనికుడు అష్టావక్రమునీశ్వరుని దోడ్కొని వచ్చెను.

ఆ మునీశ్వరుని గాంచగనే ప్రధానామాత్యునకత్యంతక్రోధము ప్రజ్వలించెను కాని... తన క్రోదమును బహిర్గత మొనర్చలేదు. క్రోదమగపరచినయడల కార్యసిద్ధికానేరదనియు. యింకను ఏదేని విపరీతము జరుగునేమోనని యోచించి, వినయముగా "ఓ మునివరా..! మారాజునకేమైనా మంత్ర ప్రయోగము చేసితిరా...?" ప్రశ్నించెను.

అప్పుడామునీశ్వరుడు" మీరాజుపై మంత్రప్రయోగము చేయునెడల నాకేమి ప్రయోజనము కలుగగలదు...? మీరాజునకు నేనేమియును చేయలేదు. రాజును నీవేమియును ప్రశ్నించలేదా..?" ప్రశ్నించినాడు.

"స్వామి..? రాజు మాప్రశ్నలకుత్తరమిచ్చుటలేదు. రెండు రోజులుగా అన్నపానాదులు లేవు. ఉపవాసియైయున్నాడు. దయచేసి మారాజు భుజియించునట్లు అనుగ్రహింపుడు" అని వేడ్కొనినాడు. అప్పుడా మునీశ్వరుడు రాజును సమీపించి "ఏమి జనకా"..? ప్రశ్నించెను.

"మహాత్మా ఏమి ఆజ్ఞ...?" రాజు ప్రశ్నించినాడు.

"నేను నీకేమి చేసితిని ...?" ముని ప్రశ్న.

"మీరేమియును చేయలేదు మహాత్మా....! అట్లని ఎవరు చెప్పిరి...?"

"జనకరాజా....! ఏమియిట్లుపడియుంటివి...? లెమ్ము ఆనందముగా కూర్చుండి భోజనము చేయుము" మునీశ్వరుడు పలికినాడు.

జనకరాజప్పుడు లేచి, నిత్యకృత్యములు తీర్చుకొని, భోజనముచేసెను అదిచూసి ఎల్లరూ ఆనందాశ్చర్యమగ్నులైనారు. జనకుడు భుజించి నిశ్చలుడైయుండెను అంత ప్రధాని "మునివరా! కృపయుంచి మారాజు నెప్పటిస్థితికి రప్పింపుము" అని ప్రార్థించెను.

అది వినిమునీశ్వరుడు ప్రధానామాత్యులను, యితర సర్వపరివారమును తమ, తమ గృహములకు పొండని ఆజ్ఞాపించి. ద్వారమును లోపలినుండి బంధించి, జనకమహారాజును సమీపించి అతనితోయిట్లనియె. "ఓ రాజా..! నీ వీవిధముగా చేష్టలుడిగియుండుటకు కారణమేమి.

అందులకు "గురువరా...! ఈ దేహమందు నాకెట్టి స్వాతంత్ర్యమును లేదు. ఈ కాళ్ళు నావికావు చేతులు నావికావు. ఈ జిహ్వ నాదికాదు ఈ నేత్ర కర్ణాదిక సర్వేంద్రియములు నావికావు. ఈ రాజ్యము నాదికాదు. ఇంతయేల వీనన్నింటిలోనూ నాకేమియు హక్కులేదు. నాతను మనో ధనములు సత్యముగ మీ చరణ కమలములకు అర్పించియున్నాను. మీ ఆజ్ఞలేక నేనెట్టి చేష్టలు చేయుటకునూ అర్హుడను కాను" జనకమహారాజు ప్రత్యుత్తరమిచ్చెను.

అత్యంత శ్రద్ధాయుక్తములగు జనకమహారాజు వచనములను వవినిన అష్టావక్రముని మిగుల ప్రసన్నహృదయుడై జనకమహారాజు మస్తకముపై తన హస్తమునుంచి యిట్లనియె.

"కుమారా...! జనకా...! నీవు ముముక్షువగుటకు తగిన జ్ఞానాధికారివగుదువో..? లేదో...? తెలియటకై నేనీప్రథమ పరీక్ష చేయుట ఆవశ్యకమాయెను. నిన్ను పరీక్షించి, మెచ్చితిని. నీవిప్పుడు బ్రహ్మోపదేశమొందుటకు ఉత్తమోత్తమాధికారివియైయున్నావు. రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశ మొందుటకు నీవు తగిన అధికారివిగా నాకు లభించినావు. ఓయి...పుత్రా...! నిశ్చయముగా నీవిపుడు బ్రహ్మస్వరూపుడవు నీవు సర్వదా నిశ్చయముగా ముక్తుడవే..! నీవు కృతకృత్యుడవు. శాస్త్రప్రాప్యుడవు. అఖండ సుఖరూపుడవు."

పై మాటలను మునీశ్వరుని ద్వారా వినిన జనకమహారాజు "మహాత్మా...! నేను పరిచ్ఛిన్నుడను, వికారిని, అజ్ఞానిని కదా...! నాకు బ్రహ్మస్వరూపమెట్లు లభించును..?" ప్రశ్నించినాడు. మరలభక్తి ప్రపత్తులతో మునీశ్వరుని ముఖమండల వీక్షణగావిస్తూ

***"కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి.***
***వైరాగ్యంచ కథం ప్రాప్త మేతద్బ్రూహి మమప్రభో...!"***

అని ఆ మహామునీశ్వరుని ప్రశ్నించెను.

పిమ్మట యీ అష్టావక్రగీత ప్రారంభింపబడెను. ఈ విధముగా ప్రశ్నోత్తరరూపముగా యీ అష్టావక్రగీత సంభూతమై జనకరాజునకు పూర్ణముగా తత్త్వోపదేశము చేసెను. ఈ బ్రహ్మోపదేశమువలన పొడమిన పూర్ణానందముతో జనకునకు ఆ రాత్రి అంతయూ గడిచిపోయెను. సూర్యోదయమైనంతట లోపలి ద్వారము తెరువబడెను. అంతప్రధానామాత్యుడు, యితర పరివారము మునీశ్వరుని అజ్ఞపొంది నమస్కారపూర్వకముగా జనకమహరాజు ఉన్న అరాజమందిరములో ప్రవేశించి, బ్రహ్మోపదేశ కారణమున పరమానందయుతుడైన జనకమహారాజును గాంచి హర్షమొందిరి.

ఆ సమయమున జనకమహారాజునుద్దేశించి అష్టావక్రముని యిట్లనియె. "ఓ రాజా...! రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశమగునను శాస్త్రవచనమును గూర్చి నీకు సంశయము కలదేని నీ అశ్వమును వెంటనే రప్పింపుము"

"మహాత్మా..! నా చిత్తమందు యిపుడెట్టి సంశయమునూ లేదు. శాస్త్రవచనము కేవలము సత్యము. మీ అపరిమిత కరుణ నాయందు ప్రసరింప నేను కృతార్థుడనైతిని" అనెను.



**కథా సంగ్రహము సమాప్తము.**

**శ్రీ సద్గురు పరమాత్మనే నమః**

# అష్టావక్రగీత

ప్రధమ ప్రకరణము - ఆత్మానుభవోపదేశ వర్ణనము.

***ఓం సచ్చిదానంద సంధాన శుద్ధ బోధోపదేశినం,***
***గురుం శ్రీ అమృతానందం మోహధ్వాంత నుదం నమః***

జనకమహారాజు తన సంపుర్ణ శ్రద్ధాభక్తుల వలన ప్రసన్నుడైన అష్టావక్రమహామునిని అడుగుచున్నాడు.

***కధం జ్ఞానమవాప్నోతి కధం ముక్తిర్భవిష్యతి.***
***వైరాగ్యం చకధం ప్రాప్తమేతద్బ్రూహి మమప్రభో॥ 1॥***

మహాత్మా. గురుదేవా, జ్ఞానవైరాగ్యములు ఏ విధముగా కలుగగలవు...? ముక్తి కలుగుట యెట్లు...? వీనిని వివరముగా నాకు బోధింపుము.

ముక్తికాముడు. తన చరణములను శరణముగ నాశ్రయించిన జనకమహారాజునకు అష్టావక్రముని ఆత్మతత్వమునుపదేశించుచున్నాడు.

***ముక్తిమిచ్ఛసి చేత్తాత విషయాన్విషవత్త్యజ,***
***క్షమార్జవ దయా తోష సత్యం పీయూష వద్భజ ॥ 1॥***

ఓ శిష్యా...! సర్వఅనర్ధములను తొలగించి, నిత్యపరమానంద సుఖమును గూర్చునట్టి ముక్తియందు కోరిక కలదేని అనర్ధములను కలిగించునటువంటి విషమునెట్లు పరిహరించెదవో, ఆ విధముగనే సర్వ అనర్ధములకు మూలమగు దేహాదివిషయములయందు ఆసక్తిని విడిచి అంతర్ముఖుడవగుము. అనగా అహం అను (నేను, నాది) అధ్యాసను విడువుము అని అభిప్రాయము. మరియు క్షమ, ఆర్జవము, దయ, సంతోషము, సత్యము, అను వీనిని అమృతము వలె స్వీకరింపుము.

దేహముమొదలుకొని అహంకారము వరకుగల దృశ్యములన్నియు విషయములే. కాబట్టి విషప్రాయములగు యీ విషయములందు. ఆసక్తిని విడువుము. బాహ్యపదార్ధములయందు ఆశలేకుండా వుండుటయే "దయ" యనబడును. ఇట్టి భాహ్యేంద్రియ నిగ్రహమునలవరచుకొని, క్షమా, అర్జవత,

ఆదిగాగల అంతరింద్రియ నిగ్రహమను శమమునభ్యసింపుము. క్షమ, ఆర్జవ, తోష, సత్యములు ఆత్మజ్ఞధర్మములు-

క్షమమనగా సర్వసహనము. సకల వికారములకు సాక్షియగు ఆత్మను సదా భావించుటచేత సర్వమును సహించవచ్చును. సర్వాదిష్ఠానత్వము ఆత్మధర్మము.

ఆర్జతయనగా అవిద్యారూపమగు వంచనలేకుండుటయే. అనగా మాయాసంబంధమైన యేవికారమును కలుగకుండుట.

దయయనగా నిర్హేతుకముగా యితరుల మేలును కోరుట. ఇదియును ఆత్మధర్మమే.

తోషమనగా సదా ఆత్మసుఖము. సర్వదా ఆనందమయుడై యుండుట. ఇదియునూ ఆత్మ స్వరూపమే.

సత్యమనగా కాలత్రయమునందును మార్పు కలుగని ఆత్మయే.

సర్వసిద్ధులకు కారణమగు అమృతమును ఎంత ప్రేమతో స్వీకరించెదవో అంత ప్రీతితో యీ క్షమార్జవాదులను స్వీకరింపుమని శమదమాదిసాధన చతుష్టయ సంపన్నుడగు శిష్యునకు మహాత్ముడగు మునీశ్వరుడు ముక్తి సాధనమును ఉపదేశించుచున్నాడు.

ఈ ప్రధమ శ్లోకము, యీ గ్రంధములో వివరించిన విషయములన్నింటి కన్నికీలకము. సర్వవేదాంత సారమై నాయకమణి వలె అలరారుచున్నది.

**నపృథ్వీ నజలం నఅగ్నిర్నవాయుర్ద్యౌర్నవాభవాన్ ।**
**ఏషాం సాక్షిణిమాత్మానాం చిద్రూపం విద్ధిముక్తయే ॥ 2 ॥**

ఓ శిష్యా ! పృధివ్యాధి పంచభూతములలో ఏదియునూకావు. ఆ పంచభూతములును, వాని గుణములును దేహ ధర్మములుగాని ఆత్మ ధర్మములుకావు. కనుక వాటి ఆపేక్షనుంచకుము. తెలుపు, నలుపు, పొట్టి, పొడవు, లావు, సన్నము మొదలగు రూపములు దేహ ధర్మములు మాత్రమే ! అట్టి దేహముల రాకపోకలకు సాక్షిమాత్రుడగు ఆత్మయే నీవని దృఢముగా నమ్మి ఆత్మసాక్షాత్కారమును పొందుము. కుండను చూచువాడు కుండకంటే వేరుగా నున్నట్లు దేహమునుచూచునీవు దేహము కంటే వేరుగానుండు సచ్చిదానంద స్వరూపుడవు.

***యదిదేహం పృథక్కృత్య చితి విశ్రామ్యతిష్టసి ।***
***అధునైవసుఖీ శాంతో బంధముక్తో భవిష్యసి ॥ 3 ॥***

శిష్యా! నీవు దేహమునందు ఆసక్తిని విడిచి, పంచభూతాత్మకమైన యీదేహాది సర్వేంద్రియములకు విలక్షణుడవుగా ఉండుట తెలుసుకొని సచ్చిదానంద స్వరూపములో ఉంటివేని యీ జీవిత దశలోనే పరమానంద ప్రాప్తిని పొంది సుఖియించెదవు. అనగా కర్తృత్వ, భోక్తృత్వముల నుండి, వాటి వలన కలుగు అనర్థముల నుండి విముక్తుడవగుదువు.

***నత్వం విప్రాదికో వర్ణోనశ్రమీ నాక్షగోచరః !***
***అసంగోసి నిరాకారో విశ్వసాక్షీ సుఖీభవ ॥4॥***

నీవు వర్ణాశ్రమ ధర్మములకు ప్రత్యేకముగా నుండువాడవు. వాటికన్న విలక్షణుడవు. నేను గృహస్థును, నేను బ్రహ్మచారిని, మొదలగు వర్ణాశ్రమ బేధములు స్పష్టముగా తోచుచుండగా అవి నాకులేవని చెప్పుటఎట్లు ? అని యెదవేని నీవు అక్షగోచరుడవుకావు. ప్రత్యేగాత్మయగు నీవు సాక్షీమాత్రుడవు. సన్యాసి, బ్రహ్మచారి, కులగోత్రములు యింద్రియగోచరములగుటచేత అవి దేహధర్మములు. ఆత్మధర్మములు కావు. అప్పుడు నేనెట్టివాడను అను అనుమానమురాగా, ఆత్మస్వరూపమును నిరూపించుటకై ఆత్మవిశ్రాంతి ఫలమునుచెప్పుచున్నాడు. ఆత్మస్వరూపివైన నీవు ఏ ఉపాధితోను సాంగత్యము కలిగియున్నవాడవుకావు. నిరాకారుడవు. ఈ విశ్వమునకు సాక్షీభూతుడవు. ఈ దేహముతోగాని, ప్రపంచముతోగాని నాకెట్టి సంబంధములేదు. కాబట్టి కర్మాసక్తిని విడిచి, చిదేకాగ్రతకలుగు పరమానందముపొంది సుఖముగా నుండుము.

***ధర్మా ధర్మౌ సుఖం దుఃఖం మానసాని నతే విభో,***
***న కర్తాసి నభోక్తాసి ముక్త ఏవాసి సర్వదా ॥ 5 ॥***

ధర్మము, అధర్మము, వీటివలన కలుగు సుఖము, దుఃఖములను మానసిక ధర్మములు యింద్రియ సంబంధితములు. వాటితోనీకు సంబంధములేదు. హితము కానివి, చేయకూడనివియునగు కర్మలు ఆచరించినచో లభించు ధర్మాధర్మములకు, వాటిద్వారా ఉత్పన్నమగు సుఖ, దుఃఖములకు నీవు కారణభూతుడవు, కర్తవుకాదు. భోక్తవునూకాదు.

సచ్చిదానందస్వరూపుడవగు నీవు సర్వదాముక్తుడవే. అజ్ఞానము వలన యీ దుఃఖములు, సుఖములు ఏర్పడుచున్నవి. జ్ఞానప్రాప్తి కలిగి నంతనే యీ అజ్ఞానము తొలగిపోయి దీని కారణముగా యేర్పడుచున్న వికారములు అనగా సుఖ, దుఃఖములు తొలగిపోగలవు.

***ఏకోద్రష్టాసి సర్వస్య ముక్తప్రాయోసి సర్వదా।***
***అయమేవహితేబన్ధో! దృష్టారం పశ్యతీతరమ్॥6॥***

ఓ జనకరాజా! సర్వశరీరములందును ఉండి ద్రష్టవై(చూచువాడవై) సచ్చిదానంద స్వరూపుడవగు నీవే సర్వవ్యాపకుడవై సర్వమును చూచుచున్నావు. కాబట్టి నీవు సర్వదాముక్తప్రాయుడవే. దేహాధ్యాసకారణంగా బంధమున్నట్లు కనుపించినప్పటికినీ యధార్థముగా నీవు బంధముక్తుడవు. ఎప్పటికినీ ముక్తుడవే! దేహాది, యింద్రియాది సర్వప్రపంచమును నీకంటే వేరుగా, పరిచ్ఛిన్నముగా చూచితివేని, నిశ్చయముగా నీకదిబంధమే కాగలదు.

***అహంకర్తేత్యహంమానో మహాకృష్ణాహి దంశితః।***
***నాహంకర్తేతి విశ్వాసామృతం పీత్వాసుఖీభవ॥7॥***

శిష్యా...!నేనుకర్మలను చేయువాడను అను అహంభావము గొప్ప కృష్ణసర్పము. అదియే కర్తృత్వాభిమానము. ఆ అహంభావము వలన కలుగు సుఖదుఃఖములకు లోబడుటయే ఆకృష్ణ సర్పమువలన కబళింపబడుట. కావున అట్టి అహంభావమును ఒదిలి "నేను కర్తనుగాను" కేవలము సాక్షిని ఆత్మస్వరూపుడను అనియెడి దృఢవిశ్వాసమను అమృతమును త్రాగి పరమానంద ప్రాప్తిపొంది సుఖింపుము.

**ఏకో శుద్ధబోధోహమితి నిశ్చయవహ్నినా।**
**ప్రజ్వాల్యా జ్ఞానగహనం వీతశోక స్సుఖీభవ ॥8॥**

"నేను స్వజాతీయ, విజాతీయ స్వగత బేధములులేని స్వప్రకాశ చిదాత్మను. సర్వప్రపంచమును నేనై వెలుగుచున్నాను" అనెడి నిశ్చయ జ్ఞానము అను అగ్నిచేత అజ్ఞానమనెడి వనమును పూనికతోతగులబెట్టి జననమరణములవలన కలుగు శోక,మోహ,రాగ,(క్లేశాది), ద్వేషాది,దుఃఖములనుండి తప్పించుకొని తద్వారా దుఃఖరహితుడవై ఆత్మానుభవసుఖమును పొందుము.

**-: స్వజాతీయ విజాతీయ స్వగత భేధముల వివరణము :-**

సజాతీయ భేదము :- తనజాతి వస్తువుకంటే తానుభేదముగా నుండుట,
(ఉదా :- ఒక వృక్షమునకు మరొకవృక్షముతోగల భేదము)

విజాతీయ భేదము :- ఇతర జాతివస్తువు కంటే తాను భేదముగానుండుట.
(ఉదా :- ఒక చెట్టునకు రాయితోగల భేదము)

**స్వగత భేదము** :- తనయందే ఉండు అవయములకు, యింద్రియములకుగల పరస్పర భేదము. (ఉదా:-ఒక చెట్టునందే దాని కొమ్మలు పత్ర పుష్పాదులతో భేదము).

ఒక్కటిగానే ఉండి, అవయములేని, ఆత్మకు యీ బేధత్రయములేదని "ఏకమేవా అద్వితీయంబ్రహ్మ" అనెడి శృతి బోధించుచున్నది. (నేను, నాది, నాదేహము,యిత్యాది దేహాభిమానమే అజ్ఞానము, దానివలన కలిగెడు శోక, మోహ,రాగ,ద్వేషాదులు అనెడి లతాగుల్మములతో చేరినదే అజ్ఞానకాననము. ఈ దేహాదివిషయములలో నాకెట్టి సంబంధమును లేదు. నెను శుద్ధ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపుడను అనెడి జ్ఞానమే వహ్ని, ఈ వహ్నిని 'ప్రజ్వలింప చేసినయడల అజ్ఞానమనెడి కాననము దగ్ధమగును. అప్పుడు మిగిలియుండునది శుద్ధభోదరూపబ్రహ్మానందము. 'స్వప్న వృత్తాంతమువలె అసత్యమగుయీ సర్వప్రపంచమును చూచి, బ్రహ్మానందమయుడై ఉండుటే' అని భావము.

**యత్రవిశ్వమిదంభాతి కల్పితం రజ్జుసర్పవత్,**
***ఆనంద పరమానందః సభోదస్త్వం సుఖంచర ॥9॥***

ఏ సద్గురు భోదవలన దృశ్యప్రపంచమంతయు రజ్జువునందు సర్పభ్రాంతి కలుగునట్లు భ్రాంతిచే మాయాకల్పితముగా తోచునోఅట్టిభోదయె చిదాత్మనగు నేను, అని తెలుసుకొని సుఖింపుము. స్వప్నములో అజ్ఞానము కారణంగా పులులను సింహములను చూచి భయపడినవాడు జాగ్రదావస్తలో ఆపులులు, సింహాములు కల్పితములని తెలుసుకొని స్వప్నమందు. కలిగిన భయముపోయి యెటుల చిత్తశాంతిపొందునో, అటులనే అజ్ఞాన కల్పితమగు విశ్వభ్రాంతి గురుభోదవలన తొలిగిన వెంటనే యీ సంసారదుఃఖములుతొలగిపోయి సుఖించును. అయినచో దుఃఖ కారణమగు ప్రపంచ భ్రాంతి తొలగిపోయి, దుఃఖాభారమైనంతమాత్రమున సుఖమెట్లు కలుగునని అనెదవేని నిత్యానందానంద స్వరూపమును జెప్పెద వినుము.

అనంత పరమానందముగా మనుష్య, దేవలోకానందముల కంటె అత్యుత్కృష్టమగు పరమానందమే నీవు. 'ఏతస్యైనానందస్యాన్యానిభూతాని మాత్రోముపజీవంతి' అనెడి శృతిప్రమాణము. ఆత్మానుభవానందమే పరమానందము. బ్రహ్మానందము. ఇతరమైన ఆనందములు బ్రహ్మానందములోని పరమాణువులు.

**ముక్తాభిమానీ ముక్తోహి బద్ధాభిమాన్యపి ।**
***కిం వదంతీహ సత్యేయం మతిస్సాగతిర్భవేత్ ॥ 10 ॥***

నేను ముక్తుడను, అనెడి అభిమానముగలవాడు నిశ్చయముగముక్తుడు. నేను బద్ధుడను అనెడి అభిమానముగలవాడు బద్ధుడేయగును. కారణమేమనగా..? బంధమోక్షములు రెండును అభిమాన కల్పితములే! ఇవి నిజమైనవికావు. జ్ఞానికి బంధమోక్షములు లేవు. పరమార్ధ దశయందు ఆత్మమాత్రమే సత్యము. మాయచేత కల్పించబడినదంతయు అసత్యము. " యా మతిస్సాగతిర్భవేత్ " అనెడి పండిత వాక్యము కూడా యీ విషయమునే ప్రతిపాదించుచున్నది. మరియు " యం యంవాపి స్మరన్ భావం " ఈ మొదలగు స్మృతులను యీ అర్ధములే ధృవపరుచుచున్నవి. నరులు పూర్వజన్మమందలి విద్యకు, కర్మమునకు, ప్రజ్ఞకు తగిన దేహముందాల్చి వ్యవహరింతురని శ్రుత్యర్ధము. ఏ విషయమును మనసులో తలుచుకొనుచు పూర్వదేహమును విడుచునో ఆయా స్మరణమునకు తగిన దేహమును పొంది వ్యవహరింతురని స్మృత్యర్థము. ఉదా॥ కావుననే జడ భరతునకు అంత్యస్మరణానుగుణముగ హరిణ మహిష జన్మములు కలిగెనని పురాణ ప్రసిద్ధి.

***ఆత్మాసాక్షీ విభుఃపూర్ణ ఏకోముక్త శ్చిదక్రియః ।***
***అసంగోనిస్పృహశ్శాంతో భ్రమాత్సంసారవానివ ॥ 11 ॥***

దేహాది సకలేంద్రియంములు చేయు పనులన్నియు తానే చేయుచున్నాననెడి అపభ్రమము (లేనిది ఉన్నట్లు తలంచుట) చేత ఆత్మ వ్యవహారివలెతోచును. కాని విచారణ, విమర్శచేయగా తాను వ్యవహర్తయేకాదు. ఏమనగా సాక్షి, విభువు, పూర్ణము, ఏకము, ముక్తము, చైతన్యము, అక్రియము, అసంగము, నిస్పృహము, శాంతము అనుయీ పది ఆత్మధర్మములు.

ఇందు సాక్షి అనగా దేహాదులు చేయు క్రియలకును, అహంకార మునకును సాక్షిమాత్రుడేకాని ఆత్మవానికి కర్తకాడు. విభువు అనగా సర్వప్రపంచమునకు అధిష్ఠాత, ప్రభువు. సర్వవ్యాపకుడు కనుక పూర్ణుడు స్వజాతీయ, విజాతీయ, స్వగత భేదము లేదు కనుక ఏకము. మాయ మతత్సంబంధ కార్యములకు అతీతుడే కనుక వస్తుగతి చేత సదాముక్తుడు. స్వప్రకాశకుడై, సర్వజగత్తును ప్రకాశింప చేయుటచేత చైతన్యమాత్రుడు. చేష్టారహితుడుగాన అక్రియుడు. తనకెట్టి సంబంధములేదు కనుక అసంగుడు. ఎట్టివిషయములయందు ఆసక్తి లేనివాడుగనుక నిస్పృహుడు. ప్రవృత్తి, నివృత్తి, శరీరత్రయమను చిత్తవృత్తులునూ లేనందున శాంతుడు.

ఏ పనియైనను చేయునపుడుగాని మానునపుడుగాని మనస్సు సంకల్పించును. వాక్కుపలుకును. కరచరణాద్వయములు కర్మలచేయును. ఆత్మ మనో, వాక్కాయ, కర్మలకు సాక్షిమాత్రుడును, వానితో సంబంధములేనివాడును. ప్రవృత్తి, నివృత్తులు యింద్రియ ధర్మములే కాని ఆత్మధర్మములు కావు. కావున ఆత్మవ్యవహారికాడు.

**కూటస్థంబోధ మద్వైతమాత్మానాం పరిభావయ ।**
**అభాసోహం భ్రమం ముక్త్వాభావం బాహ్యమధాన్తరమ్ ॥ 12 ॥**

శిష్యా ! అహంకారమే నేను అను భ్రాంతిని వదిలిపెట్టుము. పిమ్మట యిది నాది, యీ దేహమునేను, యీ గృహమునాది, మొదలగు భాహ్యాసంబంధిత పదార్థములయందు మమకారమును, నేను సుఖిని, దుఃఖితుడను, మూఢుడను, మొదలగు అంతద పదార్థసంబంధమగు అభిమానమును ఒదిలిపెట్టు, నేను అకర్తను. అసంగుడను, బోధస్వరూపుడను సర్వవ్యాపనుడనగు అద్వితీయ పరమాత్మను అనుకొనుచు సర్వధాభావింపుము.

**దేహాభిమానపాశేన చిరం బద్ధోసి పుత్రక ।**
**బోధోహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ॥ 13 ॥**

వత్స పుత్రకా ! దేహమేనేనను దృఢమైన అభిమానపాశముచేత చిరకాలమునుండి నీవు బంధింపబడివున్నావు. నేను కేవలము " జ్ఞాన స్వరూపుడను" అను చిద్రూప ఖడ్గముచేత ఆ బంధమును పూర్తిగా నరికివేసి, ఆత్మసుఖమునుపొందుము. ప్రాణులన్నియూ జన్మ ప్రారంభమునుండియు

అజ్ఞానకారణముగా అభిమానబద్ధులైయుండుట సహజము. దేహాభిమానములేని ప్రపంచ వ్యవహారమేలేదు. ధీమంతుడగువానికి జ్ఞానసాధనము కలదు కనుక, భ్రమమాత్రమును, మిథ్యాకల్పితమును అగు దేహాది ప్రపంచమును వదిలిపెట్టు, బాహ్యాంభ్యంతరవాసనలనెల్ల విడిచిపెట్టు, నిత్యమూ సర్వవ్యాపకమై, అంతర్జ్యోతి రూపమున పరమేశ్వరునితో అభిన్నమగు ఆత్మస్వరూపమును సద్గురువు ఉపదేశమువలన తెలుసుకొని సదా సచ్చిదానంద స్వరూపములో ఉండుటయే ముక్తి, మోక్షము అని అష్టావక్రమునీంద్రుడు జనక మహారాజునకు మరల, మరల బోధించెను.

**నిస్సంగో నిష్క్రియోసిత్వం స్వప్రకాశో నిరంజనః।**
**అయమేవహితేబంధః సమాధిమనుతిష్ఠసి ॥ 14 ॥**

శిష్యా ! నీవు నిశ్చయముగానిస్సంగుడవు. దేహదులలో దేనితోడను నీకు సంబంధమేలేదు. మరియు నీవు నిష్క్రియుడవు. ఏలయననీవు స్వయం ప్రకాశస్వరూపుడవు. (ఏ విధమైన ఆవరణలేని). నిరంజనుడగు పరిశుద్ధాత్మవు! అటువంటినీవు సమాధిని అనుష్టించుటకు ప్రయత్నించితివేని నిష్క్రియుడవగు నీవు సక్రియుడవగుదువు. కావున సమాధియు బంధమేయగును. జ్ఞానాభివృద్ధికొరకుచేయు యేఅనుష్ఠానమైనను కర్మయగుటచే ముక్తికి ప్రతిబంధమేయగును. (అప్రయత్నముగా సర్వమనోవృత్తులు నశించి, తనంతటతానే చిదేకాగ్రతలో ఉండుటయే జ్ఞానము. అదియే ముక్తి.)

**త్వయావాప్తమిదం విశ్వంతయిపోతం యథార్థతః।**
***శుద్ధబుద్ధ స్వరూపస్త్వ మాగమః క్షుద్ర చిత్తతాం ॥ 15 ॥***

ఓ శిష్యా ! కార్యములగు ఆభరణములు, కారణమగు స్వర్ణముచే వ్యాపింపబడియుండునట్లు, కార్యమగు యీ విశ్వమంతయు (సర్వకారణ పరిపూర్ణాత్మవగు) నీచే వ్యాపింపబడియున్నది. మట్టినుండి కుండలు, ముంతలు మొదలగునవి యెట్లుగుచున్నవో ఆ విధముగానే ప్రపంచమంతయు చిద్రూపాత్మయగు నీనుండే కలుగును. యథార్థముగా నీవు పరిశుద్ధుడవు. అవిద్యకును, దీనివలన కల్పింపబడుచున్న ప్రపంచమునకును నీవు అతీతుడవు. స్వయం ప్రకాశమానమగు చిద్రూపుడవు. మరిము "సర్వగంధః సర్వరసః నేతి, నేతి" అనుశృత్యనుసారముగను. ఆధ్యారోపవాదన్యాయముగను ఆత్మతత్త్వము ప్రపంచాతీతమైనవి. కాబట్టి సర్వదా స్వయంప్రకాశమాన పరిపూర్ణ బుద్ధ

స్వరూపునిగా నిన్ను నీవు తెలుసుకొని, దీనికి విపరీతములగు క్షుద్రభావనలు కలుగకుండ చిదాత్మానుభవమున సుఖింపుము.

**నిరపేక్షో నిర్వికారో నిర్భరశ్శీతలాశయః।**
***అనాధ బుద్ధి రక్షుబ్ధో భవచిన్మాత్రవాసనః ॥ 16 ॥***

శిష్యా ! ప్రాణధర్యములగు క్షుత్పిపాసలు, మనో ధర్మములగు శోక, మోహములు. దేహధర్మములగు జరా మరణములు అనెడి షడూర్ములను జాయతే పుట్టుట, అస్థి, పుట్టియుండుట, వర్ధతే పెరుగుట, విపరిణమతే పండుట, అపక్షియతే-తరుగుట, వినశ్యతి-నశించుట, అను షడ్భావ వికారములు నీకు లేవు. కాబట్టి నీవు నిరపేక్షకుడవు. (ఆత్మేతరమందు కోరిక లేని వాడవు). నిర్వికారుడవు. నిర్భరుడవు. (చిద్ఘనస్వరూపువు) శీతలాశయుడవు (ముక్తిపర్యంతము సుఖస్వరూపుడవు) అక్షుబ్ధుడవు (అవిద్యవలన కలుగు క్షోభలేనివాడవు) నీ స్వరూపముయిటువంటిది. కావున దేహమువలెనే దేహ సంబంధమగు సర్వక్రియలును అవిద్యా కల్పితములని రూఢి నమ్మి, వానిని స్మరించక నిరంతరము చిన్మాత్రుడవై ఆత్మానందము పొందుము.

**సాకారమనృతం విద్ధి నిరాకారంతు నిశ్చలమ్।**
***ఏ తత్త్వోపదేశేన న పునర్భవసంభవః ॥ 17 ॥***

ఓయి శిష్యా ! కంటికగుపించు, దేహాది సర్వప్రపంచమునుమిధ్య అని తెలుసుకొని, దానిని విషతుల్యముగానెంచి, దాని యందభిమానమును మొదలంటవిడువుము. ఎటువంటి రూపములేని ఆత్మతత్త్వము మూడు కాలములలోనూ సర్వమునకు సాక్షియై స్థిరస్థాయిగ ఉండునని యెరుంగుము. దీనికి "నిత్యం విజ్ఞానమానందం బ్రహ్మ" అనుశ్రుతి ప్రమాణము. అనగా విజ్ఞానము (అనుభవము) వలన కలుగు ఆనందమే బ్రహ్మము. అదియే చిన్మాత్రరూపము. ఆ చిన్మాత్ర తత్త్వమునందు సదావిశ్రమించి యుండుటయే ముక్తి. ఆ ముక్తిని పొందినచో జన్మరాహిత్యము లభించును.

**యథైవాదర్శమధ్యస్థే రూపేంతః పరితస్తుసః।**
***తథైవాస్మిన్శరీరేంతః పరితః పరమేశ్వరః ॥ 18 ॥***

అద్దమునందు ప్రతిబింబించు శరీరాదికము యొక్క లోపల, వెలుపలను, చుట్టును అద్దము వ్యాపించి యున్నటులె యీ స్థూల శరీరమందు లోపలను,

వెలుపలను, నలుప్రక్కలను చిదాత్మయగు పరమేశ్వరుడు వ్యాపించియున్నాడు. ఈ ఉదాహరణమువలన "యతోవిశ్వమిదంభాతి కల్పితం రజ్జు సర్పవత్" యిత్యాది శ్లోకపాదములచేత చెప్పబడిన ప్రకరణార్ధమంతయు యీవిధముగా సంక్షేపముగ సూచింపబడినది.

సముద్రములో ముంచబడిన ఘటములు బాహ్యాభ్యంతరములయందు ఆవరింపబడి యుండునట్లు, సకలమైన ఉపాధులు బాహ్యాంతరములయందు పరమాత్మచే ఆవరింపబడి **(The Universal Light)** యున్నవి. ఆ పరమాత్మ చైతన్యమువలననే యీ ఉపాధులను ఉపేక్షింపగా నిత్య సత్యవస్తువగు పరమాత్మ మాత్రమే శేషించియుండును. కావున ఆ "పరమాత్మయేనేను" (బ్రహ్మాస్మి) అను నిశ్చయ జ్ఞానము కలుగుటయే మోక్షసాధనమని అభిప్రాయము.

**ఏకం సర్వగతం వ్యోమ బహిరంతర్యథా ఘటీ ।**
***నిత్యం నిరంతరం బ్రహ్మసర్వభూత గణేతథా ॥ 19 ॥***

ఘటాదులలోపలను, బయటను, వ్యాపించియ్ను ఆకాశము సర్వగతమై, సత్యమై, ఏకమై యెట్లున్నదోఅటులనే పరబ్రహ్మము సర్వభూత గణముల యొక్క బహిరంతములయందు సర్వదా నిత్యమైవ్యాపించియున్నది. కావున "బోధోహం" అనుదృఢ విశ్వాస జ్ఞానఖడ్గముచేత దేహమేనేననెడి పాశమునునిర్మూలించి, ఆత్మసుఖము పొందుము. (నానారూపముల గనుపడు ఘటాదులు భిన్నమై నశించినను, ఘటాదుల బహిరంతరములనుండు ఆకాశము నిత్యమై, ఏకమైయున్నటులె, నానారూపములతో కనపడు భూతగణసంకీర్ణమైన దృశ్యప్రపంచమునశించినప్పటికి పరిపూర్ణైక పరబ్రహ్మయగు ఆత్మ సర్వవ్యాపియై, నిత్యమై స్థిరముగానున్నదని భావము).

## 1వ, ప్రకరణము

### ఆత్మానుభవోపదేశము సమాప్తము



## 2వ, ప్రకరణము

# ఆత్మానుభవోల్లాసము

## శిష్యప్రోక్తము

శ్రీ అష్టావక్రముని ఉపదేశించిన తత్వబోధామృతమును గ్రోలినవాడై, జనకరాజు తనకు ఆత్మానుభవానందముప్పొంగగ, గురుకృత ఉపకారమును ప్రదర్శించుటకై, ప్రాచీన సంస్కారవశమున బాధితానుగతమగు మోహవిడంబనను స్మరించుచున్నాడు.

**అహో ! నిరంజనశ్శాంతో బోధోహం ప్రకృతేః పరః।**

**ఏతావంత మహంకాలం మోహేనైవ విడంబితః ॥ 1 ॥**

అహో ! ఏమి ఆశ్చర్యము ? నాకు కలిగిన అదృష్టమువలన గురూప దేశములు కలిగిన అద్భుతమైన అనుభవములను యిప్పుడు నేను పొంది సర్వోపాధి వినిర్ముక్తుడను, సర్వవికారశూన్యుడను, మాయాంధకార నిర్గతుడను, స్వప్రకాశ చిద్రూపుడనైతిని. అయ్యో ! గురూపదేశమునకు పూర్వము దేహమిట్టిది, ఆత్మయిట్టిది. అనువివేకములేనివాడనై మోహవశుడనైయుంటిని. ఇప్పుడు గురుబోధవలన ఆత్మానందానుభవమును కలిగియుంటిని.

**యథాప్రకాశయామ్యేకో దేహమేనం జగత్।**

**అతోమయ జగత్సర్వమథవా నచకించన ॥ 2 ॥**

ఏకాత్మనై నేను యీ స్థూలదేహమును యెటుల ప్రకాశింపజేయుచున్నానో అటులనే యీ ప్రపంచమును కూడా ప్రకాశింపజేయుచున్నాను. (జడమగు దేహమువలనే యీ విశ్వము సయితము జడమేకాని ఆత్మకాదని భావము).

దృశ్యమగు యీ ప్రపంచమంతయు దృశ్యరూపుడనగు నాయందు ఆరోపించగా, ఆరోపిత జగత్తు ప్రబోధకాలమందు స్వప్నమందుతోచు జగత్తువలె మిథ్య యగును. సత్యాసత్యవస్తువులకు సత్య సంబంధమెప్పటికిని కలుగనేరదు. ఆరోపణమును కల్పితమే! ఈ విధంగా ఆధ్యారోపవాదములను విమర్శింపగనేను ప్రకృతికి విలక్షణుండనైన శుద్ధబోధస్వరూపుడను. అని భావము.

ఆధ్యారోపమనగా : స్వస్వకార్యములగు గగనమారుతాది భూతములవలన యీ భౌతిక జగత్తు కలుగుట.

అపవాదమనగా : భూ, జలాదిభూతములు తమ, తమశౌర్యములతో గూడ స్వస్వకారణములందు లభించుట.

అధ్యాసమనగా : భ్రమచే అది కానిదానిని అది యని తలంచుట.

అధ్యాసికమనగా: అధ్యాసముచేత కలిగిన సంబంధముతత్వ జ్ఞానముచేత నశించునదే కాని సత్యముకాదు.

**సశరీర మహోవిశ్వం పరిత్యజ్యమయాధునా ।**
**కుతశ్చిత్కౌశలాదేవ పరమాత్మావిలోక్యతే ॥ 3 ॥**

ఆహా ! ఏమి ఆశ్చర్యము ! ఇప్పుడు లింగశరీర కారణశరీర సహితముగా యీ స్థూల శరీరమును (ప్రపంచమును) పరిత్యజించి విమర్శింపగా, శాస్త్ర, ఆచార్యోపదేశమువలన ప్రాప్తించిన చాతుర్యముచేత కదా పరమ ఉత్కృష్టమగు ఆత్మానందమును అనుభవించున్నాను. మిథ్యయగు శరీర త్రయమును విచారణచేయగా సత్యమగు ఆత్మమాత్రమే మిగులుచున్నది. పరమాత్మాను భవమునకు గురుబోధ తప్పయితరములేదని భావము.

**యథానతో యతోభిన్నా స్తరంగాః ఫేనబుద్బుదాః ।**
**ఆత్మనో తదా భిన్నం విశ్వమాత్మనిర్గతమ్ ॥ 4 ॥**

జలమందుపుట్టిన బుద్బుదములకు జల సత్తకంటె అన్యసత్తలేని చందమున, ఆత్మయందారోపింపబడిన విశ్వమునకు ఆత్మసత్తకన్నా మరోసత్తలేదు. తరంగ బుద్బుదాదులగు జలము అధిష్ఠానమైనందున అవి జలముకంటే అన్యములెట్లుకావో, ఆవిధముగానే సర్వప్రపంచమునకు అధిష్ఠానమైన చిద్రూపాత్మకంటె జగత్తు వేరుకాదు.

సముద్రములో జనించు తరంగములు సముద్రముయేు అని భావించునటుల సర్వ అధిష్ఠానమైన ఆత్మయొుక్క వివర్తరూపమగు ప్రపంచమంతయు పరమాత్మగనే భావింపవలెనని అభిప్రాయము. దృశ్యమును బ్రహ్మముగా భావించుచుండుటచేత దృశ్యవస్తుస్ఫురణము క్రమముగా నశించి బ్రహ్మమే స్ఫురించుచుండును.

**తంతుమాత్రోభవేదేవ పటోయద్విద్విచారితః ।**
**ఆత్మతన్మాత్రమేవేదం తద్వద్విశ్వం విచారితమ్ ॥ 5 ॥**

స్థూలదృష్టిని విచారింపగా వస్త్రము నూలుపోగులతోనేయబడిన వస్త్రరూపముగానుండియు నూలు కంటే విలక్షణముగా కనబడునుచున్నను అది

నూలు పోగే అయినట్లు. బాహ్య దృష్టికి యీ ప్రపంచమంతయు బ్రహ్మముకంటే విలక్షణముగా కనుపించుచున్నను, విచారణచేయగా అది ఆత్మసత్తా మాత్రాత్మకమేయగుచున్నది. నూలులేనిది వస్త్రములేనట్లు ఆత్మకానిది విశ్వమునలేదు. వస్త్రమునకు నూలు అధిష్ఠానమైనట్లు విశ్వమునకు ఆత్మయే అధిష్ఠానమని భావము.

**యద్వైవేక్షురసేక్షప్తా వాప్తైవ శర్కరా ।**
**తథా విశ్వంమయిక్షప్తం మయావ్యాప్తం నిరంతరం ॥ 6 ॥**

చెరుకు రసమున కల్పింపబడిన చక్కెరయొక్క మాధుర్యము చక్కెరకు అధిష్ఠానమైన చెరుకునదే అయినట్లు, నిత్యానందస్వరూపాత్మనగు నా యందు కల్పితమైన విశ్వము. బాహ్యాభ్యంతరములందంతట నిత్యానందస్వరూపుడనగు నాచేతనే వ్యాపంచబడియున్నది. కావున విశ్వము ఆనందాత్మస్వరూపమే అనిభావము.

జీవునకు ఆనందము సహజము. ఏ ప్రాణియు సహజమగు ఆనందము పోవలెననియు, దుఃఖము కావలెననియు కోరదు. కాని, దుఃఖముపోవలెననియు, ఆనందము కావలెననియుకోరును. కాబట్టి ఆ ఆనందము నిత్యము, సహజము. అదియె బ్రహ్మస్వరూపము. దుఃఖము ఉపాధికృతము. ఇచట "ఆనందాద్ధ్యేవ ఖల్విమానిభూతో జాయంతే"."ఆనందో బ్రహ్మ" యిత్యాది శ్రుతులు ప్రమాణము. మరియు "అస్తిభాతిప్రియంరూపం నామ చేత్యంశ పంచకం । ఆద్యత్రయం బ్రహ్మరూపంజగద్రూపం తతోద్వయం ॥ ఇతిశ్లోకరీత్యా ఆత్మ స్వధర్మములగు అస్తి, భాతి, ప్రియం అనురూపములచేత నేనంతటను నిండియున్నాడను అని పై శ్లోక త్రయముచేత నిరూపింపబడినది. 4,5,6,.

**ఆత్మజ్ఞానాజ్జగద్భాతి ఆత్మజ్ఞానాన్నభాసతే।**
**రజ్జ్వజ్ఞానా దహిర్భాతి తద్జ్ఞానాద్భాసతే నహి ॥ 7 ॥**

రజ్జువునందు సర్పభ్రాంతి కలిగినప్పుడు భ్రాంతి కధిష్ఠానము రజ్జువుకేవలము సర్పమువలెనే కనపడును. కాని అది రజ్జువుగాతెలిసినంత దాని యందు సర్పభ్రాంతి కలుగదు. ఆ ప్రకారమే, అధిష్ఠానమగు ఆత్మవస్తువును తెలియనపుడు, ఈ విశ్వము విశ్వముగనే కనపడును. కాని, ప్రబోధవలన ఆత్మత్త్వము తెలిసినంతటి స్వప్న ప్రపంచమువలె విశ్వము మిథ్యయగును. కాకాక్షి న్యాయమున ఏకదృష్టి యిచట భావించవలయును.

***ప్రకాశోమేనిజం రూపం నాతిరిక్తోస్మ్యహం తతః।***

***యదా ప్రకాశతేవిశ్వం తదాహం భాస ఏవహి ॥ 8 ॥***

ప్రకాశమనగా నిత్యబోధయే నాస్వాభావికరూపము. అట్లు స్వయం ప్రకాశుడనగు నేను ఆ ప్రకాశము కంటె వేరుకాను. ఇచట "యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకం" అనుగీతా వచనము ప్రమాణము. విశ్వము ప్రకాశించునపుడెల్ల ఆత్మప్రకాశముననే ప్రకాశించుచున్నది. స్వరూపచైతన్యము సర్వజడభాసకము. జడవస్తువేదియు ఆత్మప్రకాశము లేక స్ఫురింపదు. మరియు, ఆత్మస్వరూప ప్రకాశమేలేని యడల జగత్తు భాసింపదు. ఆత్మప్రకాశ సహితమగు ధీవృత్తి వస్తువునావరించిన అజ్ఞానమును తొలగింప వస్తుసత్త స్ఫురించును. ప్రపంచమెప్పుడు స్ఫురించినను ఆత్మప్రకాశముననే స్ఫురించునని "తస్యభాషా సర్వమిదం భాతి" అనెడి శ్రుతిబోధించుచున్నది.

***అహో! వికల్పితం విశ్వమజ్ఞానాన్మయి భాసతే!***

***రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యధా ॥9॥***

అహో ! ఏమి ఆశ్చర్యము ! శుక్తియందు రజితభ్రమయు, రజ్జునందు సర్పభ్రాంతియు, ఎండమావులయందు జలభ్రాంతియు కలుగునటుల సచ్చిదానంద స్వరూపుడనగు నా యందు అజ్ఞానమువలన మిథ్యాకల్పితమగు యీ ప్రపంచమంతయు స్ఫురించుచ్నుది.

***మత్తోవినిర్గతం విశ్వంమయ్యేవలయమేష్యతి।***

***మృది కుంభో జలేవీచిః కనకే కటుకం యధా ॥ 10 ॥***

మట్టినుండి కుండలు, ముంతలు, మొదలగునవియు, జలము యందలలు, స్వర్ణమునుండి ఆభూషణములును కలిగి, అవియామృత్తికాదుల యందే లయించుచునటుల విశ్వమంతయు నావలననే కల్పితమై, నాయందే లయమగుచున్నది. (అనగా అజ్ఞానదశయందు ప్రపంచము స్ఫురించును, జ్ఞానలబ్ధి తర్వాత నాలోనే లయమగును) ఇచట "యతోవా యిమానిభూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభి సంవిశంతి" అనెడు శ్రుతి ప్రమాణము.

పరమాత్మయందు అంతర్భూతమైయున్న మాయాశక్తియే అధ్యాసచేత ప్రపంచరూపముగా భాసించుచున్నది. అనగా ప్రపంచము పరమాత్మయొక్క వివర్తరూపము. శుక్తియందు రజితము. రజ్జువు నందు సర్పమును తోచిన విధముగనే యీ ప్రపంచమంతయు మాయచేకల్పితము. ఆ మాయపరమాత్మ

కంటె భిన్నముకాదు. కావునమాయాకల్పిత ప్రపంచము. అనగా సర్వదృశ్యమును పర బ్రహ్మమే అని భావము.

***అహో! అహం నమోమహ్యం వినాశో యస్య నాస్తిమే ।***
***బ్రహ్మాదిస్తంబ పర్యంతం జగన్నాశేపి తిష్ఠతి ॥ 11 ॥***

సకలమునకు ఉపాదానమయ్యును నాకు వికారధ్వంసములులేవు. ఏలయన ఆ భూషణములకు స్వర్ణమువలె ప్రపంచమునకు నేను పరిణామోపదానకారణమును కాను. పటమునకు దంతువువలె ఆరంభోపదాన కారణమును కాను. మరి నేనేమన ? సర్పారోపమునకు రజ్జువువలె వివర్తోపదాన కారణమగుదును.

(అధిష్టానమునకు మార్పులేకయే ఆరోప స్ఫూర్తి) వివర్తో ప్రదానము. ఇందు ఆరోపదృష్టిగల వానికి అధిష్టానము స్ఫురింపదు. అధిష్టాన దృష్టిగల వానికి ఆరోపము స్ఫురింపదు. "దంతిని దారువికారే దారుతిరోభవతిసోపి తత్రైవ । జగతి తథా పరమాత్మానపి జగత్తిరోధత్తే" అని గురుప్రోక్తము. సకల కార్యములకు వివర్తోపాదానము కారణమై కాలత్రయమునందును నాశనములేక ప్రకాశించునాకు నేనేనమస్కరింతును. బ్రహ్మాదిస్తంబపర్యంతమునుగల చరాచర ప్రపంచము నశించును, దానికి సాక్ష్మిమాత్రుడనగు నాకు నాశనము లేదు. ప్రళయసమయమునందు సైతము సర్వసాక్షినగు (ఆత్మకు) నాకు నాశము లేదు. ఇదియే భావము. ఇచట "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" "అజోనిత్య శాశ్వతోయం పురాణః" యిత్యాది శృతులు ప్రమాణములు.

***అహో...! అహంనమోమహ్యామే కోహం దేహవానపి ।***
***క్వచిన్నగంతా నాగంతా వ్యాప్యవిశ్వమవస్థితః ॥ 12 ॥***

ఆశ్చర్యరూపుడనగు నాకు 'నేను నమస్కరించుచున్నాను ! నా నా సుఖదుఃఖములతో కూడిన వివిధ శరీరములందున్నప్పటికి సర్వాత్మనునేనొక్కడినే! ఎట్లన...? సూర్యుడు చంచలోపాధులయందు కంపమువలన వివిధ రూపముల గనుపడుచున్నను ఒక్కడేఅయినట్లు, విశ్వవ్యాపకుడనైయున్నందున పరిచ్ఛిన్నాహంకారమునకు విలక్షణుడనగు నేనెటనుండియురాను. ఎటకునుపోను. నానా విధోపాదులయందున్నను. సర్వపరిపూర్ణుడనై, నిత్యుడనైయున్నాను. కావున ఉపాధులకు రాకడపోకడలు ఉన్నను నాకు (ఆత్మకు) అవిలేవు.

**అహో! అహంనమోమహ్యం దక్షోనాస్తీహ మత్సమః।**
**అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరంధృతం ॥ 13 ॥**

నూనె లేని కాగడా యేవిధముగా వెలుగదో, అటులనే ఆత్మప్రకాశము లేని శరీరాదిక విశ్వము ప్రకాశింపదు. శరీరములందుండియు, శరీరములను స్పృశింపకయే చిరకాలమునుండి యీస్థావరజంగమ రూపమగు సర్వజగత్తును ధరించియున్నాడను. అట్టి అసంభావ్యకార్యవిధానచతురుడు నాకన్నను మరొకడు లేడు. కావున అట్టి ఆశ్చర్యరూపుడనగు నాకే నమస్కారము.

**అహో ! అహం నమోమహ్యం యస్యమేనాస్తికించన ।**
**అధవా యస్యమేసర్వం యద్వాఙ్మనస గోచరం ॥ 14 ॥**

సత్యము వ్యావహారికము. ప్రాతిభాసికము పారమార్థికమని త్రివిధము. జగద్వ్యాపార సమర్థమగునది వ్యావహారిక సత్యము. స్వప్నమందప్పటికి మాత్రముతోచుచు మేలుకువరాగా లేకపోవునది ప్రాతిభాసిక సత్యము. కాలత్రయాదిబాధితమగు ఆత్మయొక్కటే పారమార్థిక సత్యము. ఆత్మనగు నావలె పరమార్థసత్యమగునది. మరియొకటిలేదు. నాకు శరీరముతో సంబంధము మిధ్యాతాదాత్మ్యము వలన కల్పితము. బంగారము నగలుగా మారునప్పటికి నగల అవస్థయందును, దీని పూర్వోత్తరావస్థలయందును బంగారమేయగు నటుల ప్రపంచముతో మిధ్యాతాదాత్మ్య సంబంధములో ఉన్న ఆత్మ విశ్వముతో కలిసి ఉండును. అనగా విశ్వాకారముగ ఉన్నప్పుడును, విశ్వముయొక్క పూర్వోత్తరావస్థలయందును. స్వయంప్రకాశమానమయి ఉండును. ఆ కారణంగా సర్వవ్యవహారములయందును, వ్యవహారసంబంధములేనప్పుడును పరమాశ్చర్యరూపుడనగు నాకేనమస్కారము.

**జ్ఞానం జ్ఞేయంతథాజ్ఞాతాత్రిత్రయం నాస్తివాస్తవం ।**
***అజ్ఞానాద్భాతియత్రేదం సోహమస్మినిరంజనః ॥ 15 ॥***

జ్ఞానము. జ్ఞేయము, జ్ఞాత అనుత్రిపుటీస్వరూపముమాయా కల్పితమే కాని పారమార్థికముగా లేదు. అనిర్వచనీయమ్మైన అజ్ఞానమువలన మిథ్యాతాదాత్మ్యముచేత యీ విశ్వము నాయందధ్యస్తమయి భాసించునో, అట్టి నేను నిరంజనుడను. అనగా ప్రపంచములతో సంబంధములేనివాడను.

***ద్వైతమూల మహోదుఃఖం నాన్యత్తస్యాస్తి భేషజమ్ ।***

***దృశ్యమేతన్మృషా సర్వం ఏకోహం చిద్రసోమలః॥ 16 ॥***

నిరంజనుడుగు ఆత్మకు దుఃఖమను భ్రమ ద్వైతమువలనకలిగినదేకాని వాస్తవముకాదు. మాయా తత్కార్యాతీతుడును. సచ్చిదానందస్వరూపుడను అగునేనొక్కడనే నిత్యుడను "ఈ ప్రపంచ వస్తుసముదాయమంతయు అసత్యము" అనుజ్ఞానమే సర్వదుఃఖములకు గొప్ప ఔషదము.

***బోధమాత్రోహ మజ్ఞానాదుపాధిః కల్పితోమయా ।***

***ఏవం విమృశతో నిత్యం నిర్వికల్పేస్థితిర్మమ ॥ 17 ॥***

పారమార్థికముగా విచారింపగా నేను చిదేకమాత్రుడను. సర్వాధిష్ఠాన మగునాయందు నామాయాశక్తివలనే అహంకారాదులతో కూడిన ద్వైత ప్రపంచము కల్పింపబడినది. ఈ విధంగా ప్రతినిముషము విమర్శచేయుట వలన ద్వైతవాసన నశించి స్వరూపచైతన్యమందు స్థితికలిగినది. (బ్రహ్మాస్మి) అనునిష్ఠ కలిగినది.

***నమేబంధోస్తిమోక్షోవా భ్రాంతిశ్శాంతానిరాశ్రయా ।***

***అహోమయిస్థితం విశ్వం వస్తుతో నమయిస్థితం ॥ 18 ॥***

నేను ఎల్లపుడు చిదానందస్వరూపుడనగుటచే నాకుబంధమోక్షములు నిజముగా లేవు. అయినచో శాస్త్రవిచారణవలన కలుగు ఫలమేమిటనగా ఆరోపించబడిన బంధమోక్షములకు కారణమగు భ్రాంతిని దూరముచేయుటయే దానికిఫలము. నాయందు ఆరోపించబడిన విశ్వముఅన్నికాలములలోనూ (త్రికాలములు) నాసత్తకన్న అన్యమైన సత్త లేనిదగుటవలన, నిజముగా లేదను విచారణవలన, అజ్ఞానజన్మమగుభ్రమతొలగిపోవునేకాని, యీవిచారణవలన సచ్చిదానందస్వరూపము పుట్టింపబడదు. కావున అదినశించునదియునుకాదు. శాస్త్రవిమర్శనముచేత భ్రాంతి సమసిపోవును. అజ్ఞానముతొలగిపోవును. ఆ విధముగా విచారణచేయనివారలకు భ్రాంతి తొలగిపోనికారణమున ముక్తిలేదు.

***న శరీరమిదం విశ్వం నకించిదితి నిశ్చితమ్ ।***

***శుద్ధచిన్మాత్ర ఆత్మాచ తత్కాస్మిన్కల్పనాధునా ॥ 19 ॥***

శరీరొపాధితో కూడిన యీ విశ్వము సత్యమనిగాని, అసత్యమనిగాని నిశ్చయింపబడదు. ఇందుకు "నేహనాస్తికించన"అనెడి శృతిప్రమాణము. ఆత్మచిన్మాత్రము. శుద్ధము. మనోహరము. మాయ. మలశూన్యము. కావుననే

ప్రపంచకల్పనకు మూలకారణమైన అజ్ఞానము నశించినపుడు. విశ్వము దేనియందు కల్పింపబడును......? ఆ ప్రపంచ కల్పనకు ఆధారమేలేదు. ఆకారణంగా ఆకల్పన మిథ్యయేయగును.

**శరీరం స్వర్గనరకా బంధమోక్షౌభయం తథా ।**

**కల్పనామాత్రమేవై తత్కింమే కార్యం చిదాత్మనః ॥ 20 ॥**

ఈ ఉపాధికి సంభందించిన స్వర్గము, నరకము కల్పనామాత్రమేకాని నిజము కాదు. ఎల్లప్పుడును స్వయం ప్రకాశరూపుడుగానుండు రవికి మబ్బులు అడ్డుగానుండుట, అడ్డుతొలగి పోవుట లాభనష్టములు కలిగించని విధముగా. చిదాత్మనగునాకుయీ శరీరాదికముల రాకపోకలవలన లాభనష్టములు లేవు. విధినిషేధములను బంధమోక్షములను బోధించెడి శాస్త్రములు అజ్ఞానులకు మాత్రమే వర్తించగలవు. కాని సచ్చిదానంద స్వరూపులకు ఆశాస్త్రములవలన ప్రయోజనములేదు.

**అహో ! జన సమూహేపి నద్వైతం పశ్యతోమమ ।**

**అరణ్యమివ సంవృత్తం క్వరతిం కరవాణ్యహం ॥ 21 ॥**

ద్వైతభ్రాంతిలేని నాకు యీ జనసమూహమంతయునిర్జనమైన ఆరణ్యమువలె నున్నది. కాబట్టి యీ మిథ్యాకల్పిత విశ్వములో నేను ఏ వస్తువును ప్రేమించగలను...? (దృశ్యరూపుడనగునాకు యీకనుపించు వస్తువులయందు ప్రేమలేదని భావము)

**నాహందేహో నమేదేహో జీవో నామహం హిచిత్।**

***అయమేవహి మేబంధ అసీద్యా జీవితే స్పృహా ॥ 22 ॥***

ఈ దేహము జడముకాబట్టి అదినేనుకాను. సంగము లేనివాడను కాబట్టి నాకు దేహములేదు.. అకర్త్రాత్మనగు నాకు కర్తలరూపమగు అహంకారము న్నూలేదు. నేను కేవలము సచ్చిదానంద స్వరూపుడను. అయినచో వివేకులకు కూడా ఉపాధియందు స్పృహ ఏల ఉండగలదనియెదవేని, వినుము. ఈ ఉపాధియందు స్పృహయేలోగడ నాకు బంధమయ్యెను. జీవించుటకై పురుషుడుచేయు ధనార్జన, యిత్యాది వ్యహారములు జీవితేచ్ఛాబంధముకాగలదు. అదిజ్ఞాన సాధనమునకు ప్రతిబంధకము. ఇపుడు గురుభోదను పొందినవాడనై, నిస్సంగుడనై, చిద్రూపానుభవశాలినైయున్ననాకు ప్రాణాధారణరూపమగు జీవితమందు అభిలాషలేదు.

**అహోభువన కల్లోలైర్విచిత్రైర్ద్రాక్సముత్థితమ్ ।**
**మయ్యనంత మహాంభోధౌ చిత్తవాతే సముద్యతే ॥ 23 ॥**

ఏమియీవింత....? అమందానంద సాగరుడనగు నాయందు చిత్తము వాయువులా బయలు దేరి, నానావిధ భువన మోహనరూపములగు తరంగములు ఉత్పన్నమగుచున్నవి. ప్రశాంతముగా ఉన్న మహాసముద్రములో వాయువిజృంభణమువలన తరంగములు జనించినను. ఆ తరంగములు సముద్రము కంటే వేరుకావు. ఆవిధముగానే సచ్చిదానంద స్వరూపమందు చిత్త విజృంభణముకలిగినంతనే నానా విధప్రాకృతిక వస్తు సముదాయములు చిత్తభ్రాంతి కారణముగా సంభవించగలవు. ఆ వస్తు సముదాయములు చిదాత్మకంటే వేరుకావు. అనగా ఆత్మతోకూడిన చిత్త వైకల్యము మాత్రమేయీ ప్రపంచమును స్ఫురింపజేయుచున్నది. మిథ్యయగు చిత్తచాంచల్యము ఆత్మస్వరూపముకాదు కనుక ఆ చిత్తమందు రూపుదాల్చు సంకల్ప, వికల్పరూపమగు యీ ప్రపంచము కూడా మిథ్యయే అని భావము.

**మయ్యనంతమహాంబోధౌ చిత్తదాతే ప్రశామ్యతి ।**
**అభాగ్యజ్జీవ వణిజో జగత్పోతో వినశ్వరః ॥ 24 ॥**

సచ్చిదానంద స్వరూపుడనగు నాయందు జగత్తును సృష్టించు మనస్సు సంకల్ప వికల్పములు లేకుండా శాంతించగా స్థిరత్వమేర్పడును. మనస్సు, బుద్ధి, అహంకారముల కారణంగా నిర్మలాత్మకు జీవన్ముక్తి కలుగును. అప్పుడు స్వప్నమందు తోచునట్లే జీవునకు విశ్వముగోచరించును, కాని మనోబుద్ధ్యంహాకారములు ఆత్మ యందు లయమైనప్పుడు, జ్ఞానపరిపూర్ణమై ఆత్మనిర్మలమై బోధరూపముగా నుండును. పిమ్మట సకల ప్రారబ్ధక్షయమై మోక్షము కలుగును.

**మయ్యనంత మహాంబోధా వాశ్చర్యం జీవవీచయః ।**
**ఉద్యంతిఘ్నంతి ఖేలంతి ప్రవిశంతి స్వభావతః ॥ 25 ॥**

ఆహా...! ఏమి ఆశ్చర్యము...? నేను నిష్క్రియుడను, నిర్వికారుడను, నిర్మలాంతఃకరణుడును, అనంత సుఖాంబుధిని, యగు నాయందు జీవములనెడి తరంగములు స్ఫురించుచున్నవి. వీటిలో కొన్ని పరస్పరము శత్రుభావముతో కలహించుచున్నవి. కొన్నిమిత్రభావముతో పరస్పరము క్రీడించుచున్నవి. అజ్ఞానముతో కూడిన కర్మలక్షయముకాగా అవి నాయందులీనమగుచున్నవి.

కాబట్టి సహజముగనే అజ్ఞానకర్మలఫలితముగనే యీ జగత్తుయొక్క ఉత్పత్తికలుగుచున్నది. ఘటము నశించినంతనే ఘటాకాశము మహాకాశములో కలిసిపోవునట్లుగా. అవిద్యతోకూడిన కామ్య కర్మలు నశించగా స్వభావసిద్ధముగా సచ్చిదానంద స్వరూపములో సర్వము నాయందే లీనమగును.

ఈ ద్వితీయప్రకరణమందు శిష్యుడగు జనకమహారాజు తన స్వానుభవస్థితిని నివేదింపగా గురువగు అష్టావక్రముని మిగుల సంతోషాంతరంగుడై, విస్మయాశ్చర్య నిమగ్నుడయ్యెను.

## ఆత్మానుభవోల్లాసము

## 2వ ప్రకరణము సమాప్తము.



## 3వ ప్రకరణము

## ప్రత్యాక్షేపద్వారోపదేశము.

### గురుప్రోక్తము

రెండవప్రకరణములో జనకమహారాజు ప్రకటించిన జ్ఞానప్రాప్తి అనుభవమును, ఆ అష్టావక్రమునీంద్రుడు దయార్ద్రహృదముతో వినినవాడై అతని విజ్ఞానమును యింకనూ పరీక్షించుటకై ఆత్మానుభవస్థితిని ఉపదేశించుచున్నాడు.

**అవినాశినమాత్మానమేకం విజ్ఞాయతత్త్వతః।**
**తవాత్మజ్ఞస్య ధీరస్య కథ మర్థార్జనే రతిః ॥ 1 ॥**

శిష్యా..! నిర్వికల్పము, కాలత్రయబాధ్యము, దేశ, కాల, వ్యవహార శూన్యమునైన చిత్స్వరూపమునందు నిధిధ్యాసగలవాడవై (ఆ చిద్రూపములో ఉండి ఆనందించువాడవై) పరిపూర్ణ ఆత్మజ్ఞానము నెరిగిన ధీరుడవైననీకు ప్రాపంచిక వ్యవహారమునందును, ధనార్జనయందు ప్రేమ ఏ విధముగా కలిగినది...? (చిదాత్మయొక్క విశేషణత్రయముచేత కాలకృత, వస్తుకృత, దేశకృత భేదములు ఆత్మకులేవని తాత్పర్యము. అతతి పర్వం= అంతటనువ్యాపించినది కనుక "ఆత్మ" అనబడును.)

**ఆత్మజ్ఞానాదహో ప్రీతిర్విషయగోచరే।**
**శుక్తే రజ్ఞానతో లోభో యధారజిత విభ్రమే ॥ 2 ॥**

శిష్యా... జనకా.....! ఆత్మజ్ఞానమదృశ్యమైనప్పుడే విషయభ్రమ కలుగునేగాని, విజ్ఞానము కలిగినపుడు ఆత్మకు అతిరిక్తమగు విషయభ్రమ బాధింపదు. అదెట్లన..? మనము ముత్యపు చిప్పను చూచి భ్రమపడి అది వెండియను భ్రమలో మునిగిపోవుచున్నాము. అది ముత్యపు చిప్ప మాత్రమే నని తెలిసినపుడు వెండియని తలంచము కదా.! ఈ విషయము జనులందరికినీ తెలిసిన విషయమే! కాబట్టి ఆత్మజ్ఞానము కలగనివానికేగాని ఆత్మజ్ఞునకు ప్రపంచము గోచరించదు.

**విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా యివసాగరే !**
**సోహమస్మీతి విజ్ఞాయకిం దీన ఇవధావసి॥3॥**

శిష్యా..! సముద్రములో లేచు తరంగములకు సముద్రజలమే అధిష్టానము కాని వేరు సత్త లేనట్లుగా, ఆత్మలో కల్పితమైన ప్రపంచమునకు ఆత్మ సత్తతప్ప వేరు సత్తలేదు "సోహమస్మి" అనగా తత్పదార్థమును, సర్వమునకూ ఆధారమగు "ఆత్మయే నేను" అని అనుభవమువలన తెలుసుకున్న వాడయ్యెను (ఆత్మసాక్షాత్కారము కలిగియు) ఇదినాది అదినాదిమొదలగు ఆశలనెందులకు పొందెదవు..?

**శ్రుత్వాపి శుద్ధ చైతన్య మాత్మాన మతి సుందరమ్ !**
**ఉపస్థేత్యంత సంసక్తో మాలిన్య మధిగచ్ఛతి ॥4॥**

గురూపదేశము వలనను, వేదాంత వాక్యములను శ్రవణయుచేయుట వలనను, శాస్త్రాధ్యయనమువలనను ప్రాప్త విషయములందు ఆసక్తిని కనపరచు జ్ఞాని మూఢుడుకాడా..? మోహ జనకమగు విషయాసక్తి జ్ఞానికి తగదని భావము.

**సర్వభూతేషు చాత్మానాం సర్వభూతాని చాత్మని !**
**మునే ర్ఞానత ఆశ్చర్యం మమత్వమనువర్తతే ॥5॥**

పిపీలికాది బ్రహ్మాండ పర్యంతము సర్వసృష్టికి ఆత్మ అధిష్ఠానమై ఉన్నదనియు, రజ్జువు, సర్పభ్రాంతివలె ఆత్మయందు సకలచరాచర భూతములు ఆరోపించబడినవనియు తెలిసిన మహనీయునకు కూడా విషయవాంఛలు కలిగినచో అది ఆశ్చర్యముకాదా..? శుక్తి రజిత భ్రాంతిని గ్రహించినవాడు వెండి

కానట్టి ఆ ముత్యపు చిప్పకు ఆశపడడుకదా..! స్వప్నములో గోచరించు ప్రియ వస్తువును జాగ్రదావస్థయందు విజ్ఞుడెవడునూ ఆశించదుకదా!

**ఆస్థితః పరమాద్వైతం మోక్షార్థేప్యవస్థితః।**
**ఆశ్చర్యం కామవశగోవికలః కేలి శిక్షయా ॥ 6 ॥**

సజాతీయ, విజాతీయ స్వగతభేద రహితమగు. అద్వితీయాత్మ సాక్షాత్కారముకలవాడై. మోక్షస్వరూపమగు సచ్చిదానంద పరమాత్మ యందు తదేక నిమగ్నుడయ్యును గతజన్మ వాసనల కారణముగా కోరికలకు వశుడై వైకల్యము చెందినటుల నటించుట వింతకదా..!

**ఉద్భూతం జ్ఞానదుర్మిత్ర మవధార్యాతి దుర్బలః।**
**ఆశ్చర్యం కామమాకాంక్షేత్కాల మంతమనుశ్రితః ॥ 7 ॥**

కోరికలు జ్ఞానమునకు అత్యంత శత్రువులుగా నిశ్చయించుకొనిన జ్ఞానికూడా అమిత దుర్బలునివలె విషయవాంఛలనాశ్రయించుట ఆశ్చర్యము కదా...! వినాశకాలము చేరువైనచో జ్ఞానికి విషయతృష్ణ కలుగదని భావము.

**ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్య వివేకినః।**
**ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ విభీషికా ॥8॥**

ఆత్మశాశ్వితము, శరీరాది ప్రపంచము అశాశ్వితము అనువివేకము కలిగి, ఐహిక ఆముష్మికభోగవిరక్తుడై సచ్చిదానంద స్థితి అయిన మోక్షమునకై యత్నించు జ్ఞానియు అనిత్యములగు తను , ధనములను గాంచి భీతిల్లుట ఆశ్చర్యము. స్వప్నములో కలిగిన ధన, శరీరాదులనాశనము వలన కలిగిన భీతి జాగృదవస్థయందెవ్వరికిని ఉండదు కదా...! ఆవిధముననే జ్ఞాని విషయ, వాంఛలకు భీతిల్లదని భావము.

**ధీరస్తుభోజ్యమానోపి పీడ్యమానోపి సర్వదా।**
**ఆత్మానం కేవలం పశ్యన్నతుష్యతినకుప్యతి॥9॥**

స్థితప్రజ్ఞుడగు జ్ఞానిలోక సంబంధ విషయముల అనుభవము కలిగియు యితరులు తనను అసత్య నిందాదులచే బాధించినను వానిని లెక్కసేయక ఎల్లవేళల సుఖమునే పొందుచు, తనను యితరులు పొగిడినప్పుడు సంతోషమునుగాని, నిందించినప్పుడు పౌరుషములను గాని పొందదు. పరిశుద్ధాత్మకు సుఖదుఃఖములు దూరములని అర్థము.

**చేష్టమానం శరీరం స్వంపశ్యత్యన్యశరీర వత్।**
**సంస్తవే చాపి నిందాయాం కధం క్షుభ్యేన్మహాశయః॥ 10 ॥**

ఆత్మ ఏవిధమైన క్రియాకర్మలుచేయదు. మాయ కారణంగా చేయబడుచున్న కర్మలు శరీరమునకేగాని ఆత్మకులేవు. తను శరీరమునకు అతీతమైన సచ్చిదానంద స్వరూపుడనెడి దృడనిశ్చయముకలిగి శరీరమునకు అధిక ప్రాదాన్యమివ్వకుండ శరీరమును ఉపేక్షించుమహాశయుడు యితరుల నిందాస్తుతులకు చలించడు.

**మాయా మాత్రమిదం విశ్వం పశ్యన్విగతకౌతుకః**
**అపిసన్నిహితే మృత్యౌకథం త్రస్యతి ధీరధీః॥11॥**

మృత్యువు, మృత్యువు చేచంపబడుశరీరము మాయాకల్పితములగుటచే, యీ శరీరము ఎచటనుండి వచ్చినది..? ఎచట నాశనముకాగలదు..? అను ప్రశ్నలకు కూడా తావివ్వక, ఉత్సాహమును ప్రదర్శించకుండ ఉండువాడే జ్ఞాని. "ధీరధీః" అనబడగలడు. అతడు చలించనటువంటి స్వస్వరూపదర్శన మొనర్చినటు వంటి వాడు. అట్టిపరమ జ్ఞాని మృత్యువునకు ఏ మాత్రము భీతిచెందడు.

**నిస్స్పృహం మానసంయస్య నైరాశ్యేపిమహాత్మనః।**
**తస్యాత్మ జ్ఞానతృప్తస్య తులనాకేన జాయతే॥ 12 ॥**

నేనే పరబ్రహ్మస్వరూపుడను " బ్రహ్మమహమస్మి" అను భావమును, పొంది అన్నికోరికలను విసర్జించి, మోక్షమందు సైతము నిరాసక్తతను కలిగియుండు మహాత్మునితో ఎవరుసాటి..? మరెవరును అతనితో సరితూగలేరు అని భావము.

**స్వభావాదేవ జానానో దృశ్యమేతన్నకంచన।**
**ఇదంగ్రాహ్యమిదం త్యాజ్యం సకింపశ్యతిధీః॥ 13 ॥**

తాడునందు సర్పభ్రాంతికలిగినపుడు విచారణ జరిపి, పాముకాదని తెలుసుకొను విధముగా, తత్త్వ సారమును గ్రహించి యీ దృశ్యప్రపంచమంతయు శాశ్వతమైనదనిగాని, అశాశ్వతమైనదనిగాని చెప్పుట సాధ్యముకాదని తెలిసిన జ్ఞాని యిది గ్రహించతగినది, యిదిత్యజించతగినదని తలచునా...? అతడు ఎట్టి వికల్పమును పొందదని అర్థము.

**అంతస్త్యక్తకషాయస్య నిర్ద్వంద్వస్య నిరాశిషః।**
**యదృచ్ఛయాగతోభోగో నదుఃఖాయ నతుష్టయే॥ 14 ॥**

మనసు, బుద్ధి, చిత్తము, అహంకారములతో కూడిన అంతఃకరణము యొక్క దోషకారణము వలన జనించు విషయ వాసనలు శీతలము, ఉష్ణము, సుఖము, దుఃఖములకు అతీతుడైన పూర్ణజ్ఞానికి దైవ వశమున సంప్రాప్తమగు విషయభోగములు సుఖ దుఃఖములను కలింగించవు.

**ప్రత్యాక్షేపద్వారోపదేశము.**

## 3వ ప్రకరణము సమాప్తము.



## శిష్యప్రోక్తానుభవోల్లాసము.

**4వ ప్రకరణము.**

**హంతాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా।**
**నహి సంసారవాహికైర్మూఢై స్సహసమానతా ॥ 1 ॥**

ఈ ఆనందము ఎంత ఉన్నతమైనది. తాను సచ్చిదానంద స్వరూమగుఆత్మనని తెలిసికొనినవాడై, విషయభోగములయందు మనసును కేంద్రీకరించక గతజన్మకర్మ పరిపక్వమువలన లభించు ఫలితములను ఒక ఆటగా భావించు పరమజ్ఞానికి దేహాభిమానముకలిగి మాయచేత ఆవరించబడియుండు మూఢునితో పోలిక తగదు.

**యత్పదం ప్రేప్సవోదీనా శ్శక్రాద్యాస్సర్వదేవతా।**
**అహో ! తత్రస్థితో యోగీ నహర్షముపగచ్ఛతి॥ 2 ॥**

గురుదేవా...! ఇంద్రుడుమొదలైన సర్వదేవతలు యేపరమపదము పొందకోరిక కలిగి అది లభించక దుఃఖమును పొందెదరో అట్టి తురీయస్థితియందు "తత్" "త్వం" పదార్థ ఐక్యజ్ఞానానుభవముతో వ్యవహరించు యోగి, విషయభోగమువలన హర్షమును పొందక సర్వదా ఆనందమయుడై యుండును కదా.

**తజ్ఞస్యపుణ్య పాపాభ్యాం స్పర్శోహ్యంతర్నజాయతే।**
**నహ్యాకాశస్య ధూమేన దృశ్యమానాపి సంగతి ॥3॥**

"తత్ త్వం" పదార్ధ కలయికగల జ్ఞానికి పుణ్యపాపరూపములగు అంతః కరణి ధర్మములు అంటవు. ఏవిధముగాననగా కంటికి కనిపించు పొగ ఆకాశమునకు అంటని విధముగా జ్ఞానికి పాప పుణ్య స్పర్శ ఉండదు.

**ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేనమహాత్మనా।**
**యదృచ్ఛయా వర్తమానంతం నిషేద్ధుం క్షమేతకః ॥4॥**

సృష్టిలో గల సర్వప్రపంచము (చరాచర వస్తుసముదాయము ) అంతయు పరమాత్మస్వరూపమే అను స్థిరజ్ఞానము కలిగిన మహానీయుడు వ్యవహరించు వ్యవహారమునకు విధి నిషేధములను నిర్ణయించు సమర్ధుడెవడును లేడు. దేహేంద్రియాది ప్రపంచవాసనలు లేక యింద్రియములు చేయుక్రియలయందు స్పృహయే లేక వ్యవహారించు పరమ జ్ఞానికి విధి నిషేధములులేవు. పుణ్యపాపములు అంటవు. ఏమన అట్టి జ్ఞాని సర్వదా బ్రహ్మానందము తప్పమరొక విషయములను యెరుగకుండును. ఇదియే జ్ఞానికి జాగ్రదవస్థ. ప్రక్కనున్న వారెవరైన ప్రపంచస్మృతి కలిగించినపుడు మాత్రము యీ ప్రపంచమును స్వప్నముగా తలపోయును.

**ఆబ్రహ్మస్తంబ పర్యంతే భూతగ్రామే చతుర్విధే।**
**విజ్ఞ స్త్యైవహిసామర్ధ్య మిచ్ఛానిచ్ఛా వివర్జనే ॥ 5 ॥**

భువనభాండమున గల సమస్తప్రాణులకు యిష్టము. అయిష్టములను మార్పుచేయుట సాధ్యముకాదు. అయినను యిచ్ఛాద్వేషములను మార్పుచేయ సమర్ధుడగు జ్ఞాని అతని యిష్టపూర్వకప్రవర్తన కలిగియున్నను అతనికి నియమ నిబంధనలు లేవు.

**ఆత్మానమద్వయం కశ్చిజ్జానాతిజగదీశ్వరమ్।**
**యద్వేత్తి తత్స కురుతేనభయం తస్యకుత్రచిత్ ॥6॥**

"తత్" పదార్ధము పరబ్రహ్మమగు యీశ్వరునిగాను "త్వం" పదార్ధము ఆత్మగాను, యీ రెండునూ భిన్నముకావని తెలుసుకొనిన మహాత్ముడు వేయిమందిలో ఒక్కడుండును. పైనతెలిపిన 'తత్' త్వం' జ్ఞానమును అనుభవమున తెలుసుకొనిన జ్ఞాని ప్రారబ్ధమునకు కట్టుబడి, ఆ ప్రారబ్ధ ప్రేరణచే చేయతగిన

కర్తవ్యమునే చేయును. ఆ విధముగా కర్తవ్యనిర్వహణమొనర్చినను ఇహపరములలో భయమునొందడు. కాలిన వస్త్రము, వస్త్రము వలే కనిపించినను అది శరీరముపై ధరించుటకుపయుక్తముకాదు. ఆ విధముగనే జ్ఞానివ్యవహరించెడు గ్రహణ త్యాగాదిక్రియలు వేయించిన గింజలు మొలవని విధముగా, జ్ఞానికి బంధములు కావు.

## శిష్యప్రోక్తానుభావోల్లాసము
## 4వ ప్రకరణము సమాప్తము.



# ఆచార్యోక్త లయ చతుష్టయము.
# 5వ ప్రకరణము.

**నతే సంగోస్తి కేనాపికిం శుద్ధ స్త్యక్తుమిచ్ఛసి।**
**సంఘాతవిలయం కుర్వన్నేనమేవలయం వ్రజ॥1॥**

శిష్యా...! సచ్చిదానంద స్వరూపుడవగునీకు దేహాభిమానము. అహంకారమమకారములు లేవు. నీవు ముక్తుడవు. ముక్తులకు గ్రహించునవి, త్యజించునవి అనునియమనిబంధనములు లేవు, ఆకారణంగా శరీరమందున్న చైతన్యముమాత్రమే నీవని భావించుచు. సర్వ అవయవములతో కూడియున్న యీ శరీరమునందు అనాదరణప్రదర్శించుచు ముక్తుడవుగా భాసిల్లుము.

**ఉదేతిభవతోవిశ్వం వారిధేరివ బుద్బుదః**
**ఇతిజ్ఞాత్వైకమాత్మానమేవ మేవలయంవ్రజః॥2॥**

సముద్రమునందు కలుగు అలలు సముద్రము కంటే(బుడగలు) వేరుకానటుల సచ్చిదానంద స్వరూడవగు నీయందు ఉద్భవించు యీ విశ్వము నీకంటే వెరైనదికాదు. ఈ ప్రకారముగా నిర్మలమగు ముక్తమగు ఆత్మనుతెలుసుకొని ఆత్మలో లయమై ఆ ఆత్మానుభవానందమును పొందుము.

**ప్రత్యక్షమ ప్యవస్తుత్వాద్విశ్వం నాస్త్యమేత్వయి।**
**రజ్జు సర్పఇవవ్యక్తమేవ మేవలయం వ్రజ ॥3॥**

తాడుయందు ఆరోపించబడిన పాము యొక్క భ్రాంతికొంతకాలము నిజముగా సర్పమువలె తోచినను విచారణ తర్వాత అదితాడు కంటే వేరుకానటుల, చిద్రూపుడవగు నీయందు స్ఫురించు యీ ప్రపంచము భ్రమ సమయములలో ప్రత్యక్షముగా కనిపించుచున్నను. అది కేవలము, మాయ, అవిద్యలచేత కల్పించబడినదే...? జ్ఞానము కలిగిన తర్వాత అదిలేనిదేయగును. సృష్టిలో పరబ్రహ్మతప్ప మరొక వస్తువే లేనందున నీవు ఆ సచ్చిదానందములో లయమును పొందుము.

**సమ దుఃఖ సుఖః పూర్ణఆశా నైరాశ్యయో సమః॥**
**సమజీవిత మృత్యు సన్నేవమేవ లయం వ్రజ ॥4॥**

నీవు సదాచిద్రూపుడవు, కనుక ప్రారబ్ధవశమున కలుగు సుఖ దుఃఖములు, పొగడ్త నిరసన భావములు, జీవన్మరణములు యివన్నియు ఆత్మ ధర్మములు కాక అవిద్య కారణముగా జన్మించిన వగుటచే తుచ్ఛములు. కావునవాటి విషయములలో జాగ్రత్త వహించి కృంగక, పొంగక సమభావముతో సదా బ్రహ్మదృష్టి రూపమగు లయ యోగమును సాదించుము.

**ఆచార్యోక్త లయ చతుష్టయము**

## 5వ ప్రకరణము సమాప్తము.



# ఉత్తర చతుష్కము

***6వ ప్రకరణము శిష్యప్రోక్తము.***

**ఆకాశవదనంతోహం ఘటతత్ప్రాకృతం జగత్।**
**ఇతి జ్ఞానం తదైతస్యనత్యాగో నగ్రహోలయః॥1॥**

ఆత్మనయిననేను ఆకాశమువలే అంతములేనివాడను. అయినచో అనంతమగు ఆత్మకు దేహములో నివాసము ఏవిధముగా ననిన ఘటములో ఆకాశముండును. ఘటమువిచ్ఛిన్నమయిన ఆకాశము అనంతాకాశములో లయ మగును. ఆవిధముగనే ఆత్మకూడా శరీరం ఉన్నంతవరకే అందు మిళితమైయుండి తదనంతరము విశ్వాత్మలో లయమగును కదా..!

**మహోదధిరివాహం సప్రపంచోవీచి సన్నిభః।**

**ఇతజ్ఞానం తద్దైతస్య నత్యాగో నగ్రహోలయః॥2॥**

ఆత్మనయిన నేను అపారమగు మహా సముద్రమువంటివాడను. ఆ సముద్రములో జనించు తరంగ సముదాయమువంటిది యీ మిథ్యా ప్రపంచ జాలము. ఈ విధమైనదృఢ జ్ఞానముగలవానికి స్వీకరించుటలు. పరిత్యజించుటలు ఉండవు.

**అహంసశుక్తి సంకాశో రూప్యవద్విశ్వకల్పనా ॥**

**ఇతి జ్ఞానం తద్దైతస్య న త్యాగో నగ్రహోలయః॥3॥**

ఆత్మనైన నేను రజితశుక్తి భ్రాంతిలో శుక్తివంటివాడను. భ్రమకారణముగా తోచు రజితము వంటిది యీ విశ్వము. ఈ విధమైన సంపూర్ణజ్ఞానము గలవారికి గ్రహణము–త్యాగములు లేవు.

**అహంవా సర్వభూతేషు సర్వభూతాన్యథోమయి।**

**ఇతిజ్ఞానం తద్దైత్తస్య న త్యాగో నగ్రహోలయః॥4॥**

జడమైనటువంటి మాయకును, మాయ కారణముగా స్ఫురించు యీ జగత్తునకును సత్తా స్ఫూర్తులు ఆత్మవలనే కలుగుచున్నవి. కాని యీ రెండు ధర్మములు వాటి సహజ లక్షణములు కావు. కావున సర్వసృష్టికి అధిష్టానము నేనే (ఆత్మను). ఆత్మకు అన్యమేదియును లేదు. వేదాంత సిద్ధమగు సదాత్మకు గ్రహణ త్యాగములు లేవు.

**శిష్యోక్త ముత్తర చతష్కము**

**6వ ప్రకరణము సమాప్తము.**



# అనుభవ పంచకము

## 7 వ ప్రకరణము శిష్య ప్రోక్తము.

**మయ్యనంత మహాంభోధౌ విశ్వపోత ఇతస్తతః।**

**భ్రమతిస్వాంతవాతేన నమస్త్వ సహిష్ణుతా ॥1॥**

సచ్చిదానంద స్వరూపుడనగు నేననెడి అపార మహాసముద్రమునందు విశ్వములను నావలు మనస్సను వాయువు చేత కదల్చబడి అటునిటు తిరుగులాడుచుండును. ఓడలయొక్క ఆ ప్రయాణము సముద్రమునకు ఎటువంటి

(శమకలిగించదో ఆ విధముగనే యీ ప్రపంచదృశ్యములును నాకు యెటువంటి శ్రమను కలిగించవు.

***మయ్యనంత మహాంబోధౌ జగద్విచిస్స్వభావతః***
***ఉదేతు వాస్తమాయాతు నమే వృద్ధిర్నచక్షతిః॥2॥***

నిర్మలమై, ప్రశాంతమై, మనోహరమై, ఆది అంతములు లేని నా ఆత్మయను మహాసముద్రమందు విశ్వములను అలలు అనేకములుగా సహజముగా ఉద్భవించుచుండును. మరియు మాయమవుచుండును. ఆ విధముగా యీ జగత్తులుద్భవించుటవలన వృద్ధి గాని అంతమొందుట వలన క్షయముగాని నాకు (ఆత్మకు)లేవు.

***మయ్యనంత మహాంబోధౌ విశ్వంనామవికల్పనా।***
***అతిశాంతో నిరాకార ఏతదేవాహమాస్థితః॥3॥***

తుది మొదలులు లేని తురీయుడనైన నేననెడి మహాసముద్రము నందు కనుపించు జగద్వవహారమంతయు భ్రమమాత్రమేకాని నిజము కాదు. కావున యీ విశ్వదృశ్యములవలన నాకు ఏవిధమైన ప్రమాదములేదు. కారణమేమనగా నేను జ్ఞానస్వరూపుడను. నిరంజనుడను. నిరాకారుడను అను. ఆత్మను అట్టినాకు లయయోగమక్కరలేదు.

***నాత్మాభావేషునో భావస్తత్రానంతే నిరంజనే***
***ఇత్యసక్తోస్పృహశ్శాంత ఏతదేవాహమాస్థితః॥4॥***

ఆత్మ సర్వవ్యాపి ఆ కారణముగా కల్పితములగు దేహములందు కుండలలోని జలములవలె, అధేయము (ఉంచబడునది) కాదు. ఆత్మ అనంతము. నిర్మలము కనుక నేను ఏవిధమైన సంపర్కము, యిచ్ఛాది ధర్మములు లేక కేవలము శాంతుడనై ఉన్నాను.

***అహో! చిన్మాత్రమేవాహ మింద్రజాలోపమంజగత్***
***అతోమమకథం కుత్ర హేయోపాదేనకల్పనా॥5॥***

ఆహా...! నేను చిద్రూపుడను. ఈ దృశ్యప్రపంచమంతయు యింద్రజాలమువలే కనుపించుచున్నను. ఆత్మ సత్తకంటే వేరు సత్తకలదికాదు. మిధ్యతోకూడిన ఆ వస్తువులలో నేను దేనిని కోరుదును? దేనిని గ్రహింతును? దేనిని విడుచుచుండును..?ఏదియును లేదు. ఇంద్రజాలికుడు కల్పించు అనేక వింతవస్తు సముదాయమంతయు మిథ్యయే కావున వాటియందు.

ఆప్యాయతానురాగములు ఏవిధముగా కలుగవో ఆత్మయందు మిథ్యా కల్పితములగు ప్రాపంచిక సంబంధ వస్తు సముదాయములందు జ్ఞానికి మోహము కలుగదని భావము.

## అనుభవ పంచకము

### 7వ ప్రకరణము సమాప్తము.



## బంధ మోక్ష వ్యవస్థా చతుష్కము.

### 8వ ప్రకరణము గురుప్రోక్తము

*తదాబంధో యదా చిత్తం కం చిద్వాంఛతి శోచతి।*
*కంచిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి॥ 1॥*

శిష్యా....!మిథ్యాభూతములగు వస్తువులలో దేనిని కోరుదును, గ్రహింతును, విడుతును అని నీవు చెప్పినదంతయు నిజమే. ఏలయనగా ప్రాపంచిక విషయాదులను చూసినపుడు వానియెడల వాంఛాది వికారములు కలిగెనేని అదిబంధము ముక్తికి ప్రతిబంధకమును యగును.

*తదా ముక్తిర్యదా చిత్తం నవాంఛతి నశోచతి।*
*నముంచతి నగృహ్ణాతి, నహృష్యతి, నకుప్యతి ॥2॥*

మొదటి శ్లోకములో చెప్పిన కోరుట, గ్రహించుట, విడుచుట, సంతోషించుట, కోపగించుకొనుట మొదలగు చిత్తవికారములు కలుగకుండుటయే ముక్తి.

*తదాబంధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు।*
*తదామోక్షో యదాచిత్తమసక్తం సర్వదృష్టిషు॥ 3 ॥*

ప్రాపంచికదృశ్యములు, జడములగు దేహేంద్రియములు"అనాత్మ" అను దృష్టికలిగియుండుటకూడా బంధమేయగును. కాబట్టి విషయములందేకాక ఆత్మానాత్మ వివేచనయందు సైతము లక్ష్యము లేక నిరాసక్తత కలిగియుండుటయే మోక్షము. చిత్తమునందు సంకల్ప. వికల్పములు లేకుండి ఉండుటయే మోక్షము.

*యదా నా హంతదామోక్షోయదాహం బంధనంతదా।*

*మత్వేతిహేలయా కించిన్మాగృహాణవిముంచమా ॥4॥*

సర్వఅనర్ధలకు మూలమైన "అహం" నేను అను అహంభావాధ్యాస ఎప్పుడుదూరమగునో అప్పుడు మోక్ష సిద్ధియగును. ఎంతవరకు "నేను" అను అహంభావము నిలిచిఉండునో అంతవరకు బంధముతొలగదు. శిష్యా నీవు యీ విషయముతెలిసికొనియే త్యాగ, గ్రహణాది క్రియలందు. కర్తృత్వము లేనివాడవై లీలామాత్రుడవైయున్నావు. అకర్త్రాత్మజ్ఞానము వలన కర్తృత్వాభిమానములేనివాడవై ఉన్నాడవని భావము. నేను ఆత్మను, అనాత్మను, జ్ఞానిని. అజ్ఞానిని, యిదిచేయుచున్నాను, లేదు, నిశ్చలుడను, యిత్యద్యాభిమాన శూన్యుడవై, సర్వదా సచ్చిదానంద పరమాత్మవై యింద్రియవ్యాపారములు తమంత జరుగుచున్నను. నిష్క్రియుడవైయున్నాడవని భావము గలవాడవై ఉండుము. ఇదియే ముక్త స్వరూపము.

**బంధమోక్షవ్యవస్థా చతుష్కము.**

**8వ ప్రకరణము సమాప్తము.**



# నిర్వేదాష్టకము

## 9వ ప్రకరణము- గురుప్రోక్తము

*కృతాకృతేచ ద్వంద్వాని కదా శాంతాని కస్యవా।*

*ఏవంజ్ఞాత్వేహ నిర్వేదాద్భగవత్యాగ పరోవ్రతీ॥ 1॥*

ఇది చేయతగినది, యితి చేయదగనిది. అను కర్తవ్యదీక్షయు సుఖము, దుంఖములయందు అభిమానము ఎవరికిని, ఎప్పటికిని తొలగిపోవు. ఈ విషయము తెలుసుకొని సర్వవ్యవహారములయందు మనసుపోకుండ ఉండుము.

*కస్యాపితాత ధన్యస్య లోకచేష్టావలోకనాత్।*

*జీవితేచ్ఛాబుభుక్షాచ బుభుత్సోపశమంగతాః॥2॥*

శిష్యా...! జన్మించి,నశించు తత్వముగల యీ ప్రాపంచిక వ్యవహారముల యందు సంలగ్నమై జీవితేచ్ఛను, భోగేచ్ఛను కలిగియుండు మనస్తత్వము ఒకానొకమహాశయునకే తొలగును.

***అనిత్యం సర్వమేవేదం తాపత్రితయ దూషితమ్।***
***అసారం నిందితం వేశయమితి నిశ్చిత్య శామ్యతి ॥3॥***

కనుపించు యీ విశ్వమంతయు అసత్యము, సచ్చిదానంద స్వరూపమందు ఆరోపితము. ఆత్మకంటే వేరైనదికాదు. ఆధ్యాత్మిక, అధి దైవిక ఆధి భౌతిక తాపములచే నిరాకారించబడినది. కావున యేమాత్రము సారములేనిది. కావున ఈ దృశ్యమాన ప్రపంచమంతయు అనాదరణీయమైనది. జ్ఞాని యిట్టి దృఢ నిశ్చయము కలిగి దేనియందును ఎటువంటి ఆసక్తి లేకుండా ఉండుము.

***కోసాకాలోవయః కింవాయత్రద్వంద్వానినోన్నృణాం।***
***తాన్యుపేక్ష్య యధా ప్రాప్తి వర్త సిద్ధి మవాప్నుయాత్ ॥4॥***

జనులకు భూత భవిష్యత్ వర్తమానకాలములందును, బాల్యయౌవ్వన, వార్ధక్యాదివయోలక్షణ శరీరావస్థలయందును సుఖము, దుఃఖములను రెండు అవస్థలు లేని కాలమేలేదు. అని నిశ్చయించుకొని ఆ సుఖ,దుఃఖములను లెక్కచేయక వాటిని అనాసక్తబుద్ధితో అనుభవించి ఆ కారణంగా వాసనాక్షయము పొందువాడు ముక్తినొందును.

***నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాంతధా।***
***దృష్ట్వా నిర్వేద మా పన్నఃకోనశామ్యతిమానవః ॥5॥***

గౌతమి, జైమిని మొదలగు మహర్షుల మతములు అణువులు వాటిపరిణామములు మొదలగువాటిచే ఎన్నోరకములు . హోమము, కృచ్ఛము, చాంద్రాయణాదితపస్సులు సాధువుల మార్గములు. అవి పలువిధములు. యోగుల మతములు వీటికి భిన్నములు. ఈ విధముగా పై మతములు నానావిధములుగా ఉండుటయు, ఒకదానితో మరొకదానికి సంబంధము లేకుండా ఉండుటయు. సత్యాన్వేషణకు సరియైన మార్గదర్శకములు కాకపోవుటయుంజేసి వీటియందు, కర్మలయందు నిరాసక్తతను ప్రదర్శించి. సద్గురువులు ఉపదేశించినమార్గమున సచ్చిదానంద స్వరూపుడుగా మారినవాడెట్లు ఉపశమనమును పొందకుండ ఉండును....? ఆత్మానుభవమును పొందిన వానికి యితర మార్గములు. రుచింపవని భావము.

***కృత్వామూర్తి పరిజ్ఞానం చైతన్యస్యనకిం గురుః।***
***నిర్వేద సమతా యుక్త్యా యస్తారయతి సంసృతే ॥6॥***

నిర్వేదమనగా సంసారవిషయములయందు ఆసక్తిలేకపోవుట, సమతయనగా శతృత్వ, మిత్రుత్వ భావము లేకుండా సమబుద్ధికలిగి చిదాత్మలో

ఉండుట. యుక్తిఅనగా శృతికి విరుద్ధముగాని తర్కము. ఈ మూడింటిచేతను ఆత్మసాక్షాత్కారమును పొంది ఆ తర్వాత గురు సహాయమపేక్షింపనిజ్ఞాని 'నకింగురుః?' అనబడును. ఆమహానీయుడు చిద్రూపుడై ఈభవ బంధములనుండి ముక్తుడై తరించును.

*సర్వభూతావికారాం స్త్వంభూత మాత్రాన్ యథార్థతః*

*తత్క్షణాత్ బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి ॥ 7॥*

శిష్యా ! పంచభూతవికారములగు దేహేంద్రియాదులను తత్వ విచారణవలన జడములగు పృధివ్యాది పంచభూతమాత్రములేకాని ఆత్మస్వరూపములు కావని తెలియుము. ఆ విధముగా తెలిసికొందువేని ఆక్షణమందేనీవు బంధముక్తుడవగుదువు. శరీరమే నేనను అవిద్య తొలగి అహంభావము నమసిపోయి, శరీరాదుల కంటే భిన్నమగు ఆత్మస్వరూపు డవగుదువు. ఈ శరీరాదులు అనాత్మయని తెలిసిన పిమ్మట శరీరాదులకు సాక్షిమాత్రుడవగు ఆత్మవే నీవుగాఉందువని భావము.

*వాసనా ఏవ సంసార యితి సర్వావిముంచతాః*

*తత్త్యాగో వాసనాత్యాగా త్థితిరద్య యథాతథా॥ 8 ॥*

విషయవాసనలే సంసారము కావున విషయవాసనలను విడువుము. వాసనాత్యాగమువలన ఆత్మనిష్ఠస్థిరపడును. ఆకారణముగా నీయందు సంసార భ్రమలు తొలగిపోవును. పిమ్మటశరీర పరిస్థితి ప్రారబ్ధానుసారముగా మారును.

## గురుప్రోక్త నిర్వేదాష్టకము

## 9వ ప్రకరణము సమాప్తము



# ఉపశమాష్టకము

## 10వ ప్రకరణము-గురుప్రోక్తము

*విహాయవైరిణింకామ మర్థం చానర్థ సంకులం,*

*ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరంకురు॥ 1॥*

వత్సా..! జ్ఞానార్జనకు ఆటంకమును కలిగించు కామమును, విషయాసక్తిని విడువుము. సంపాదించుటయందును, కాపాడుటయందును అనేక

అనర్థములను కలిగించు ధనముయందు ఆపేక్షనువదిలి పెట్టుట ఈ కామము, అర్థములకై అధర్మము నాశ్రయించుటకూడా విసర్జించుము.

***స్వప్నేంద్రజాలవత్పశ్యదినాని త్రీణిపంచనా,***
***మిత్రక్షేత్ర ధనాగారదార దాయాది సంపదః॥2॥***

కుమారా...! మిత్రులు, భార్య, దాయాదులు, సంపదలు యివన్నియు స్వప్నమువలెను, యింద్రజాలమువలెను, కొలది కాలము మాత్రమే ఉండునవనీ, స్థిరమైనవి కావని తెలుసుకొనుము.

***యత్రయత్ర భవేత్తృష్ణా సంసారం విద్ధితత్రవై,***
***ప్రౌఢ వైరాగ్య మాశ్రిత్య వీతతృష్ణ స్సుఖీభవ ॥3॥***

విషయాసక్తితోకూడి సంసారబంధము కలుగుచున్నది. విషయాసక్తి కలుగగనే కర్మ, ఆకర్మద్వారా సంసారమునూకలుగును, కావున ప్రౌఢ వైరాగ్యముచేత అనగా ప్రాప్తించిన భోగములందు ప్రీతియు, అప్రాప్తభోగములయందు కోరికయు లేకుండా ఆత్మనిష్ఠకలిగి బ్రహ్మానంద సుఖముననుభవించుము.

***తృష్ణామాత్రాత్మకో బంధస్తన్నాశోమోక్ష ఉచ్యతే,***
***భవా సంసక్తిమాత్రేణ ప్రాప్తి తుష్టిముహుర్ముహుః॥4॥***

కర్మవాసన బంధమునకు కారణమగును. కావున విషముతో సమానమైన విషయములయందు ఆసక్తియే బంధము. విషయవాసననశించి నంతనే నివృత్తిహేతుకమగుమోక్షము సిద్ధించును. దేహాది విషయములతో సంబంధములేని కారణముగా ప్రతిక్షణము ఆత్మప్రాప్తిలో సంతోషము కలుగును. కావున 'తృష్ణనాశనమే మోక్షము' అని భావము.

***త్వమే కశ్చేతన శ్శుద్ధోజడం విశ్వమసత్తదా,***
***అవిద్యాపి నకించిత్సాకా బుభుత్సాతదీపితే॥5॥***

లోకమందుగల పదార్థములు మూడు. ఆత్మ-జగత్తు-అవిద్య అనునవి. వీనిలో ఏకము, చైతన్యమాత్రము, నిర్మలము. పూర్ణమునై, చిదభిన్నమైనాత్మవునీవు. ఇదియే నీవు తెలియతగినది. నీవు సర్వపరిపూర్ణాత్మవు. దీనికంటే వేరుగా ఆత్మ ఉన్నదనిగాని, జగత్తు వేరనికాని తలపతగదు. జగత్తు సత్యము కానిది, జడము అవిద్య అనునది సదసద్విలక్షణమైనది. అనగా సత్తు-అసత్తునుకాక అనిర్వచ నీయమైనది. కనుకనీకిక తెలియతగినది ఏదియునులేదు.

**రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుభానిచ,**

**సంసక్తస్యాపి నష్టాని తవజన్మని, జన్మనీ॥6॥**

ప్రతి జన్మలోనూ అమితాసక్తితో సంపాదించిన రాజ్యము, సంపదలు. భార్య.పిల్లలు. దాయాదులు, రాజ్యసంపదలతోకూడిన సుఖము యెంతాసక్తితో చూచినప్పటికి అవన్నియూ ఆయా జన్మలతో అంతరించుచున్నవేకాని. మరొక జన్మకు సంప్రాప్తించవు కావున, ఈ రాజ్యాది. సంపదలతోకూడిన ప్రపంచ నటనమంతా అసత్తు, అనిత్యము, కలమాదిరి మిథ్యయేయగును. ఆత్మమాత్రము నిత్యము.

**అలమర్థేన కామేన సుకృతే నాపి కర్మణా,**

**ఏభ్య సంసార కాంతారే నవిశ్రాంత మభున్మనః ॥7॥**

ధర్మార్థకామములయందు కోరిక ఉండకూడదు. ఏమనగా యీ ధర్మార్థకామములతో నిండిన. దుర్గమమయిన సంసారమను సరోవరమునుండి తప్పించుకొని విశ్రాంతి పొందుట కడుదుర్లభము. కావునయీ ధర్మార్థకామములయందు కూడా ఆసక్తికూడదు.

**కృతంనకతిజన్మాని కాయేనమనసాగిరా,**

**దుఃఖమాయాసదంకర్మ తదద్యాప్యుపరమ్యతాం॥8॥**

కుమారా...! నీవు నీగత జన్మములందు కాయక్లేశముపొంది ప్రయాసాదిదుఃఖములను కలిగించు కర్మములెన్నియో చేసియుంటివి...? ఆగత జన్మల కర్మములవలన నీకు అనర్థములు తప్ప వేరేమి ఉండినది...? కావున యిప్పుడైనను కర్మలయందాసక్తిని వదిలి చిద్రూపుడవై ఆత్మసుఖమును పొందుము.

## గురుప్రోక్తముపశమాష్టకము

## 10వ ప్రకరణము సమాప్తము.



# జ్ఞానాష్టకము.

## 11వ ప్రకరణము-గురుప్రోక్తము.

**భావాభావవికారశ్చ స్వభావాదితి నిశ్చయా,**

**నిర్వకారోగతక్లేశస్సుఖేనైవో పశామ్యతి॥1॥**

భావము, అభావము. రూపవికారములు మాయనుండి కలుగుచున్నవి కాని వికార రహితమగు నిర్మలాత్మనుండి కలుగవు. ఈ విధమైన దృఢనిర్ణయముగల మానవుడు తన నిశ్చయబలము చేతనే అనాయాసముగా శాంతినొందును.

**ఈశ్వర స్సర్వనిర్మాతా నే హన్యఇతి నిశ్చయీ,**

**అంతర్గళిత సర్వాశ శ్శాంతఃక్వాపినసజ్జతే॥2॥**

జీవుడు ఈశ్వరవశుడు. కాబట్టి జీవునిలో కలుగు సర్వవికారముల ఉత్పత్తికి ఈశ్వరుడే కర్తఅను దృఢసంకల్పము కలిగిన మనుజుడు తన నిశ్చయబలవశముననే సంపూర్ణముగా యేకోరికలు లేనివాడగును. కాబట్టి అటువంటి వాడు నిశ్చలచిత్తుడై శాంతినొంది ఆత్మసుఖమును బడయగలడు.

**ఆపదస్సంపదః కాలేదైవా దేవేతినిశ్చయీ,**

**తృప్తఃస్వస్థేంద్రియో నిత్యం నవాంఛతి నశోచతి॥3॥**

గత జన్మలలో సాధించిన సుకృత,దుష్కృతములకు ఫలితము లభించు సమయువచ్చినపుడు ఈశ్వర ప్రేరేపితులై సుఖదుఃఖములు ఆపద సంపదలు కలుగు చుండును అనునిశ్చయము స్థిరముగా కలిగి తృష్ణారహితుడై, నిత్యతృప్తుడై, సంతుష్టుడై ఏ విధమైన కోరికలను లేక, యింద్రియములకులోబడక. వర్తించు జ్ఞాని లభించనిదానికై ఆశపడడు, దానికై దుఃఖించడు.

**సుఖదుఃఖే జన్మమృత్యూ దైవాదేవేతి నిశ్చయీ,**

**సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి నలిప్యతే॥4॥**

కర్మఫలములవలన కలిగెడు సుఖదుఃఖాదులు గతజన్మల కర్మలననుసరించియే ప్రాప్తించగలవనెడి దృఢసంకల్పము గలవాడు, నేను యీ ఫలములననుభవించుచున్నాను, అనెడి భావమే లేక నిరాసక్తముగా ప్రారబ్ధవశమగు కర్మలను కర్తృత్వాభిమాన రహితుడైచేయుచు, ఆకర్మలవలన జనించు సుఖ దుఃఖములను సమదృష్టితో సాక్షిమాత్రుడై గమనించుచు ఆత్మ సుఖమునుపొందును.

**చింతయా జాయతే దుఃఖం నాన్యదేహేతినిశ్చయీ,**

**తయాహీన స్సుఖీశాంత స్సర్వత్ర గళితస్పృహః॥5॥**

ఈ సంసార దుఃఖము చింతవలననే కలుగుచున్నదిగాని వేరే యేయితరకారణముల వలన కలుగదు అనెడి దృఢ నిశ్చయము కలిగి చింతకు లోనుకాకుండా శాంతుడై స్థిరమైన అంతఃకరణముకలిగి పరమసుఖ సాధన పరుడైన (విషయములకు లోబడకుండ ఉండుటయే పరమసుఖ సాధనము) మనుజుడు ఆత్మసుఖమొందును.

**నాహందేహో నమేదేహో బోధోహమితినిశ్చయీ,**

**కైవల్యమివ సంప్రాప్తోనస్మరత్యకృతం కృతమ్॥6॥**

ఈ శరీరము నేనుకాను , నేను యీ దేహరూపుడనుకాను. నేను చిద్రూపుడను. అనెడి నిశ్చయ జ్ఞానముకలిగినందువలన యీ శరీరమందు

అహంకారమును, మమకారమును లేని వాడై యీ శరీరసాధనముగా జరిగెడి కృతాకృతకర్మలు "నేను చేసినాను" అనుభావము లేక జ్ఞాని ప్రవర్తించును.

*ఆబ్రహ్మస్తంబపర్యంత మహమేవేతినిశ్చయీ।*

*నిర్వకల్పశ్శుచిశ్శాంతః ప్రాప్తాప్రాప్త వినిర్వృతః॥7॥*

గడ్డిపోచమొదలు బ్రహ్మపర్యంతముయగు యీ చరాచర ప్రపంచమంమంతయు "నేనే" అను దృఢ సంకల్పముగల పురుషుడు, సంకల్పవికల్పములు లేక విషయవాంఛలకు దూరుడైనిశ్చలమైన అంతఃకరణముగలవాడై, లభించిన లభించని వానియందు. యేవిధమైన స్ఫురణలేనివాడై ఆత్మానంద పరిపూర్ణుడై, పరమసంతోషిమై ప్రవర్తించును.

*నానాశ్చర్యమిదం విశ్వం నకించిదితి నిశ్చయీ।*

*నిర్వాసనస్స్ఫూర్తి మాత్రో నకించిదివశామ్యతి॥8॥*

ఈ సకల ప్రపంచమునకు అదిష్టానమగు పరమాత్మ సాక్షాత్కారము కలుగుట చేత, ఆశ్చర్య రూపమగు యీ జగత్తంతయూ, ఆత్మ సత్తకంటేవేరుకాదను నిశ్చయముగలమనుజుడు వాసనాశూన్యుడు. కేవల సచ్చిదానంద స్వరూపుడునై, కార్యకారణములనుకూడా త్యజించినవాడై తత్త్వజ్ఞానము చేత సర్వసృష్టి కూడా స్వప్నవత్ మిథ్యగా భావించి దానివలన నివృత్తుడై ఉండును.

## గురుప్రోక్త జ్ఞానాష్టకము సమాప్తము

## 11వ ప్రకరణము



# ఏవమే వాష్టకము

## శిష్యప్రోక్తము-12వ ప్రకరణము

*కాయకృత్యా సహిః పూర్వంతతో వాగ్విస్తరాసహః।*

*అథచింతా సహస్తస్మాదేవ మేవాహమాస్థితః॥1॥*

నేనుగతములో శరీరాయాసముతోకూడిన కర్మలు చేయలేకుంటిని తరువాత వాచిక రూపజ కర్మలను చేయలేనైతిని. పిమ్మట మనస్సుకు సంబంధించిన చింతలను విడిచితిని కావున యిప్పుడు నిర్వాహారుడనై స్వస్వరూపనిరతుడనై ఉంటిని.

**ప్రీత్యభావేన శబ్దాదేరదృశ్యత్వేనచాత్మనః।**
**విక్షేపైకాగ్రహృదయం ఏవమేవాహమాస్థితః॥2॥**

ఇపుడు నాకు శారీరక, వాచిక సంబంధమగు రెండు కర్మలయందును. ప్రీతిలేక ఆత్మయు యింద్రియములకు గోచరముగాని కారణముచేత శరీరమునకు సంబంధించిన అసహనము, జపము మొదలగు వాచిక విక్షేపములును త్రివిధచలనము లేకుండా ఎల్లప్పుడునూ స్వస్వరూపనిరతుడనై ఉన్నాను.

**సమాధ్యాసాది విక్షిప్తౌ వ్యవహార సమాధయే।**
**ఏవం విలోక్యనియమ మేవమేవాహమాస్థితః॥3॥**

అన్ని అనర్థములకు కారణభూతమగు కర్తృత్వ భోక్తృత్వ అధ్యాసము వలన చలనము కలిగినపుడు వానిని దూరముచేయుటకు సమాధివ్యవహారము కలుగవలయునుగాని, అట్టి చలనమే లేనప్పుడు సమాధి వ్యాపారముతో పనిలేదని గ్రహించి శుద్ధాత్మజ్ఞానము మాత్రమే ఉండి యే యితర అధ్యాసమును లేకుండుటచేత సమాధియునులేని స్వస్వరూప నిరతుడనైయుంటిని.

**హేయోపాదేయ విరహాదేవంహర్ష విషాదయోః।**
**అభావాదద్యహే బ్రహ్మన్నేవమేవాహ మాస్థితః॥4॥**

చిద్రూపుడనగు నాకుగ్రహణ త్యాగాదివస్తు సదుపాయములేదు. ఆకారణముగా సంతోషము, దుఃఖములు లేవు.కావున గురువరా, నేనిపుడు స్వస్వరూపనిరతుడనైయున్నాను.

**ఆశ్రమానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృత వర్జనం।**
**వికల్పం మమవీక్ష్యై తైరేవమేవాహమాస్థితః॥5॥**

బ్రహ్మచర్యనియమము,ధ్యానము,చిత్తము గ్రహణ వర్జనములు అనుయీ మూడింటి వలనను సంకల్ప,వికల్పములు కలుగుటలేవు. ఈ మూడును లేకయే స్వస్వరూపనిరతుడనై యున్నాను.

**కర్మానుష్ఠాన మజ్ఞానా ద్యథైవోపరమస్తదా।**
**బుద్ధ్వా సమ్యగిదం తత్త్వమేవమేవాహ మాస్థితః॥6॥**

కర్మనుచేయుటకు గాను, త్యజించుటకుగాను అజ్ఞానమే కారణము అనునిజమును తెలుసుకొనినవాడనై కర్మానుష్ఠానత్యాగములు రెండునూలేని వాడనునై స్వరూనిరతుడుగా ఉన్నాడను.

**అచింత్యం చింత్య మానోపి చింతారూపం భజత్యసౌ,**

**త్యక్త్వా తద్భావనీం తస్మాదేవ మేవాహమాస్థితః॥ 7॥**

"పరబ్రహ్మము" చింతింపవీలుకానిదని చింతించువాడును చింతాపరుడ యగును. అనగా ఆత్మచింతా లక్షణమగు రూపు ధరించువాడగును. ఈ కారణమువలన బ్రహ్మమచింత్యము అనుభావన సైతములేకభావనారహిత స్వస్వరూప నిరతుడనైయుంటిని.

**ఏవమేవకృతం యేన సకృతార్థో భవేదసౌ,**

**ఏవమేవ స్వభావో యః సకృతార్థో భవేదసౌ॥ 8॥**

సర్వక్రియారహితమగు "ఏవమేవ"అనెడి అవస్థను సాధన చేసి దానిని పొందినవాడు. కృతార్థుడు. అట్టి ఏవమేవ అనెడి. యదార్థావస్థయందు. స్వభావము చేతనేయుండు. ధన్యుని నేనేమని చెప్పవచ్చును.? అట్టి మహాత్ముడు కేవల సచ్చిదానంద పరమాత్మయేఅని భావము.

## 12వ ప్రకరణము

## ఏవమేవాష్టకము సమాప్తము



# యథాసుఖ సప్తకము

## 13వ ప్రకరణము - శిష్యప్రోక్తము

**అకించినభవంస్వాస్థ్య కౌపీనత్వేపిదుర్లభమ్,**

**త్యాగాదానే విహాయాస్మదహమాసేయథా సుఖమ్॥ 1॥**

కేవలము కౌపీనమందు ఆసక్తి కలిగెనెని సర్వసంగపరిత్యాగము వలన కలుగు చిత్త స్థైర్యము దుర్లభమే యగును. అందువలన నేనుసమస్త వస్తు గ్రహణమందును, త్యజించుట యందును, ఆసక్తిలేక సదాచిద్రూపుడనై (సుఖస్వరూపుడనై) ఉన్నాడను. నాకు దుఃఖమేలేదు.

**కుత్రాపిఖేదః కాయస్య జిహ్వా కుత్రాపిఖిద్యతే,**

**మనఃకుత్రాపి తత్త్యక్త్వాపురుషార్థే స్థితస్సుఖమ్॥ 2॥**

ఆసనము వేసుకొని యోగము ప్రారంభించినచో దేహమునకు ఆయాసము కలుగును. జపము. కీర్తనమువలన జిహ్వా క్లేశము కలుగును. ధ్యానము

వలన మనఃక్లేశముకలుగును, కాబట్టి నేనుకాయిక,వాచిక, మానసిక కర్మత్రయమును వదిలి సుఖముగా పరమ పురుషార్థమగు సచ్చిదానంద స్వరూపుడనై యున్నాను.

*కృతంకిమపినైవస్యాదితి సంచిత్యతత్త్వతః*
*యదాయత్కర్తుమాయా తితత్కృత్వాసేయధా సుఖం॥3॥*

ఇంద్రియములు శరీరము చేయ కర్మలు తాత్వికచింతనచేత విమర్శింపగా ఆ క్రియలు ఆత్మచేయునది కావని నిర్ణయించి, యీ శరీర యింద్రియాదులు చేయ కార్యములయందు అహంభావము(నేను) లేకుండా నెరవేర్చుచు ఆనందమయుడనై ఉన్నాను.

*కర్మనైష్కర్య నిర్బంధ భావాదేహస్థయోగినః*
*సంయోగా యోగ విరహా దహమాసేయధా సుఖం ॥4॥*

దేహాభిమానముగల యోగికి యిది కర్మ, యిది నైష్కర్మ్య అను నిర్భంధ రూపమగు భావము ఉండును. నేను దేహ ఉనికియందుగాని పతన స్థితి యందుగాని సంకల్పము లేనివాడనై మహదానందముగా ఉన్నాను. కావున నాకు దేహాభిమానముగాని, కర్మ, నైష్కర్మ్యనిర్భంధముగాని లేవు.

*అర్థానర్థౌ నమేస్థిత్యా గత్యా నశయనేనవా।*
*తిష్టన్ గచ్చన్ స్వపన్ తస్మాదహమాసే యధాసుఖం॥5॥*

నేను చిద్రూపుడనగుటచేత నాస్థితిగతులవలన నాకు సుఖదుఃఖములులేవు. కావున ఏ విధమైన ఆసక్తి లేకుండా ఊరుకున్నను, నడిచినను శయనించినను సర్వదా సుఖుడనై ఉన్నాడను.

*స్వపతోనాస్తిమేహానిః సిద్ధిర్యత్నవతో నవా।*
*నాశోల్లాసౌ విహాయాస్మాదహమాసే యదాసుఖం॥6॥*

సర్వప్రయత్నములను ఒదిలి ఊరకున్నను నాకు యేవిధమైన అపకారమునూ లేదు. ప్రయత్నములయందు యిమిడియున్నను నాకు వాటి ఫల ప్రాప్తి, ఆసక్తియును లేదు. ఆ కారణమువలన నేను కదులుచున్ననూ కదలకున్నను సుఖ దుఃఖములు లేనందున సర్వదా యధా సుఖియై ఉన్నాను.

*సుఖాది రూపానియమం భావేష్వాలోక్య భూరిశః।*
*శుభాశుభే విహాయాస్మాదహమాసే యధాసుఖమ్॥7॥*

ఎండాకాలములో వీచుగాలి సుఖమయము, అదేగాలి శీతాకాలమున దుస్సహము. అవిధముగనే యిప్పుడు బంధువులుగా ఉన్నవారుకొంత కాలమునకు

శత్రువులుగా మారెదరు. అలాగుననే శత్రువులుకూడా ఒకానొక సమయంలో ఆప్తులుగామారెదరు. ఈ విధమైనటువంటి సుఖదుఃఖములు అనిత్యములని తెలిసికొనినవాడనై వాటిని అనాదరణ భావముతో వీక్షించుచు సదా సుఖినైయున్నాడను.

**13వ ప్రకరణము**

**యథా సుఖ సప్తకము సమాప్తము.**



# శాంతిచతుష్టయము.

## 14వ ప్రకరణము - శిశ్యప్రోక్తము.

***ప్రకృత్యా శూన్యచిత్తోయః ప్రమాదాద్భావభావనః***
***నిద్రితో బోధిత ఇవక్షీణ సంసరణోహిసః॥ 1॥***

సహజముగా విషయానురాగములేని వాడయ్యును. నిద్రనుండి మేల్కొల్పబడిన వానివలె ప్రమాదవశమున ప్రారబ్ధవశములగు లోగా జరిగినవిషయములు బుద్ధి పూర్వకముగా భావించువాడు ''భావ భావనుడనబడును'' ఆవిధముగా నిద్రలో శూన్యచిత్తుడయ్యు ఒకానొకపుడు మేల్కొలుపబడినందున ప్రమాదమున పూర్వవిషయముల తలచుకొనువానివలె విషయ గ్రాహ్యముకలిగిన వాడయ్యును భావభావనునివలె అతడు విషయములయందు శాంత చిత్తుడేయగును. కనుక అట్టివాడు సంసార విషయములలో ఆసక్తిలేని వాడేయగును.

***క్వధనాని, క్వమిత్రాణి క్వమే విషయదస్యవః***
***క్వశాస్త్రం క్వచవిజ్ఞానం యదామేగతా స్పృహా॥2॥***

విషయములయందు ఆసక్తిలేక చిద్రూపుడనగునాకు గతించిన విషయముల స్మరణము కలుగు టెట్లు...?(కలుగదు) ధనమేల...? విషరూప చోరులేడ..? శాస్త్రమేల...? విజ్ఞానము అనగా బ్రహ్మమహామస్మి అను నిధి ధ్యాసయేల...?పరిపూర్ణాత్మదర్శినగు నాకు ధనాదులందును విజ్ఞానమందును ఆస్థయేలేదని భావము.

*విజ్ఞాతేసాక్షి పురుషేపరమాత్మని చేశ్వరే*
*నైరాశ్యే బంధమోక్షేచ నచింతాముక్తయే మమ॥3॥*

దేహమునకు , యింద్రియమువలన సాక్షియగు "త్వం" పద లక్ష్యార్థమును. పరమాత్మయగు "తత్"పదలక్ష్యార్థమును. ఏకముగతెలసి "బ్రహ్మాస్మి"అనెడి సాక్షాత్కారమువలన నిత్య నిర్ముక్త చిద్రూపాత్మానుభవము కలిగి బంధ మోక్షములందు అనాసక్తుడనగు నాకు ముక్తికొరకయినను చింతలేదు.

*అంతర్విత కల్ప శూన్యస్య బహిస్స్వచ్ఛంద చారిణః*
*భ్రాంత స్యేవ దాశాస్తా స్తాస్తాదృశా ఏవజానతే॥4॥*

అంతఃకరణయందు సంకల్పవికల్పములు లేక బాహ్యామునకు పిచ్చివానివలె స్వేచ్ఛతో తిరుగు జ్ఞానియొక్క వ్యాపారము అట్టి జ్ఞానులదే తెలియునుగాని, ఇతరులకు తెలియదు.

**14వ ప్రకరణము**

**శాంతిచతుష్టయము సమాప్తము.**



# తత్త్వోపదేశ వింశతికము

## 15వ ప్రకరణము - గురుప్రోక్తము

*యథా తథోపదేశేన కృతార్థ స్సత్వబుద్ధిమాన్*
*ఆజీవమపి జిజ్ఞాసుః పరస్తత్ర విముహ్యతి॥1॥*

సత్వబుద్ధిసంపన్నుడైన శిశ్యుడు ఒక్కసారి గురూపదేశము పొందినంతమాత్రముననే కృతార్థుడగును. కృతయుగమందు ప్రణవోపదేశమాత్రముననే శిష్యులు కృతార్థులైనారు. సత్వబుద్ధియుతులు కానివారు (రజోగుణ, తమోగుణ ప్రధానులగు) జీవితాంతము ఆత్మవిచారణ జరిపినగూడా, ఎన్నియో పర్యాయములు గురువులద్వారా బోధితులై యుండినను, అవిద్య, మోహకారణమున తరింపజాలరు. వామదేవుడు మాతృగర్భములో ఉండి కూడా కేవల సత్యమూర్తిఅయినకారణంగా ఒక్కపర్యాయము ప్రణవోపదేశము పొంది. జ్ఞానియై ముక్తినొందెను.

**మోక్షోవిషయ వైరస్యం బంధోవైషయికోరసః।**

**ఏతావదేవ విజ్ఞానంయథేచ్ఛసితథాకురు॥2॥**

విషయాసక్తి రహితుడగుటయే మోక్షము. విషయాసక్తియందు తగుల్కొనుటయే బంధము. ఈ బంధమోక్షముల తారతమ్యము తెలియుటయే ఉత్కృష్టమగు జ్ఞానము. కావున శిష్యా...!వీటిగురించి బాగుగా విచారణ జరిపి నీ యిష్టప్రకారము చేయుము.

**వాగ్మిప్రాజ్ఞమహోద్యోగం జనం మూకజడాలసమే।**

**కరోతి తత్త్వబోధోయ మతస్త్యక్తో బుభుక్షుభిః॥ 3॥**

ఈ ఆత్మతత్త్వబోధము, ఎంతో చతురముగా వాక్యములను పలుకువానినైనను మూగవానినిగా చేయును. శాస్త్రములు తెలిసిన శాస్త్రవేత్తను జడునిగాచేయును. ఎన్నోవిధములైన కర్మలనాచరించువానిని నిష్క్రియునిగా మార్చును. ఏలయనగా తత్త్వవేత్తయొక్క మనస్సు పరబ్రహ్మాస్వరుపముతో నిండియుండుటచేత అతని వాక్కు తదితరయింద్రియములు స్వంత వ్యవహారములనుండి విముఖతను పొందగలవు. అనగా బ్రహ్మాజ్ఞానము సర్వేంద్రియ జనిత వ్యవహారములను భంగపరిచి, వాటిని అదుపునందుంచును. కాబట్టి జ్ఞాని వ్యర్థములైన సంభాషణాది వ్యవహారములను చేయడు. భోగేచ్ఛాయుతులకు యీ తత్త్వబోధ రుచింపదు.

**నత్వందేహో నతేదేహో భోక్తాకర్తానవా భగవాన్।**

**చిద్రూపోసి సదాసాక్షీ నిరపేక్షస్సుఖంచర॥4॥**

నీవు కేవలసచ్చిదానంద స్వరూపుడవు. కావున దేహాది రూపము నీవుకావు. నీకు దేహముతో సంపర్కములేదు. నీవు కర్తృత్వ భోక్తృత్వములకు కేవలము సాక్షిమాత్రుడవు కావున కర్తవు, భోక్తవుకావు. ఒక దృశ్యమును చూచువాడు. అదృశ్యము కంటే వైరైనట్లుగా దేహత్రయము యొక్కరాక పోకలుచూచువాడు కేవలము సాక్షిమాత్రుడే. కాబట్టి నీవు దేహమందును తత్సంబంధ విషయములందును. ఆపేక్షరహితుడవై సుఖింపుము.

**రాగద్వేషామనోధర్మౌ నమనస్తే కదాచన।**

**నిర్వకల్పోసి బోధాత్మానిర్వకార సుఖంచర॥5॥**

శిష్యా...! రాగము, ద్వేషము మనస్సుయొక్క ధర్మములు. అమనస్కుడవగు నీకు జడమగుమనస్సుతో ఎప్పుడును యేవిధమైన సంబంధమునులేదు. కాబట్టి.

నీవుమనస్సు కావు. ఒకవేళ నీవేమనసని తలంచదవేని రాగాదులు కలుగగలవు. కావున అట్టి మనసుతోయేవిధమైన సంపర్కముంచుకొనకుము. నీవు నిర్వకల్పబోధాత్మవు. కావున రాగాదులకు దూరముగా నుండి. చిద్రూపుడవై సుఖింపుము.

***సర్వభూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని।***
***విజ్ఞాయ నిరహంకారో నిర్మమస్త్వం సుఖీభవ॥6॥***

ఆత్మసర్వసృష్టియందును కారణభూతముగా నిండియున్నదనియు. సర్వభూతములును ఆత్మయందభ్యసింపబడినవనియు గ్రహించి. అహంకార మమకారములను. విడిచి చిద్రూపుడవగుము. కనుపించని విధముగా హారము యొక్క అన్నిపూసలలోనూ దారముండినట్లు. సమస్త సృష్టియందు ఆత్మవ్యాపించియున్నది. భ్రాంతిచే తాడును సర్పముగా భావించు నటుల పరబ్రహ్మమును జగత్తుగా భావించకుము.

***విశ్వంస్ఫురతి యత్రేదం తరంగాయివసాగరే।***
***తత్త్వమేవన సందేహశ్చిన్మూర్తే విజ్వరోభవ॥ 7॥***

సాగరమునుండి కలిగిన అలలు వాటికి కారణమైన సముద్రము కంటే వేరుకావు. ఆవిధముగనే ఆత్మయందు కల్పితమగు విశ్వము స్వకారణమగు ఆత్మకంటే వేరుకాదు. శిష్యా....!నీవు ఆత్మవే కనుక ఆ విధమైన దృఢ సంకల్పముతో సకల తాపములను త్యజించి సుఖింపుము.

***శ్రద్ధత్స్వతత శ్రద్ధత్స్వనాత్ర మోహం కురుష్వభోః।***
***జ్ఞానస్వరూపో భగవానాత్మత్వం ప్రకృతే పరః॥ 8॥***

కుమారా అతిశ్రద్ధాళువువై వినుము . నీవు కేవలము జ్ఞాన స్వరూపుడవు. తత్పదార్ధమగు పరమేశ్వరుడవు. త్వంపదార్ధమగుఆత్మయును నీవే. ఈదృఢనిశ్చయమును ప్రతిబంధించెడి అసంభావనా విపరీత భావనలు అవిద్యా కల్పిత నామరూపాది జగత్తును ఉపేక్షించుట చేత తొలగగలవు.

అసంభావన యనగా "ఆత్మకలదని నమ్మకము లేకపోవుట"
విపరీత భావన యనగా "దేహమే ఆత్మయనుకొనుట"

***గుణై స్సం వేష్టితో దేహస్తి ష్ఠత్యాయాతి యాతిచ।***
***ఆత్మానగంతా నాగంతా కిమేవమనుశోచసి॥9॥***

ఇంద్రియాదులతో కూడిన యీ శరీరము యీలోకమందున్నది. కొంతకాలముక్రింద వచ్చినది. కొంతకాలము ఉండి నశించును. ఈ శరీరము కంటే

భిన్నమైన యీ ఆత్మనూతనముగా వచ్చినది కాదు. పోవునదియు కాదు. కాబట్టి నిత్యాత్మవగు నీవు " నేనుపుట్టితిని మృతినొందెదను" అని విచారించెదవేల...? ఆత్మకు శారీరకధర్మములను ఆపాదించి దుఃఖపడవలదని భావము.

***దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవవాపునః।***

***క్వవృద్ధిః క్వచవాహానిస్తవ చిన్మాత్ర రూపిణః॥ 10॥***

సచ్చిదానంద స్వరూడవగు నీకు కల్పాంతము వరకును శరీరము ఉన్నందున వృద్ధియు, యిపుడే నష్టమైనందున హానియును లేదు.

***త్వయ్యనంతమహం బోధౌ విశ్వవీచిః స్వభావతః।***

***ఉదేతు వాస్తమాయతు నతే వృద్ధిర్నవా క్షతిః॥ 11॥***

చిద్రూపుడవగునీయందు అవిద్యా కామ్యకర్మలమూలమున సృష్టియను తరంగములు సహజముగా ఉదయించును. నశించును. అందువలన నీకు వృద్ధి క్షయములు లేవు. ఏలయన చిదాత్మనిత్యము, ఏకము పరిపూర్ణము అనంతము అనాది.

***తాత చిన్మాత్రరూపోసినతే భిన్నమిధం జగత్।***

***అతః కస్యకథం కుత్ర హేయోపాదేయ కల్పనా॥ 12॥***

జగత్తు నీ సత్తకంటే వేరు సత్తలేనిది కనుక చిద్రూపుడవగునీకంటే వేరుకాదు. కాబట్టినీకు మాయతోకూడిన పదార్థముల సంబద్ధములగు హేయోపాదేయములు లేవు. ఆరోపితవస్తువు అధిష్టాన వస్తువుకంటే వేరు కాదని దీని భావము.

***ఏకస్మిన్నవ్యయే శాంతే చిదాకాశే మలేత్వయి।***

***కుతోజన్మకుతః కర్మకుతోహంకార ఏవచ॥ 13॥***

సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు లేవు. ఏకరూపుడవు నాశరహితుడవు. కార్మ సంబంధము. లేని శాంతుడవు నిర్మల చిద్రూపుడవు సర్వఉపాధి శూన్యడవు అయిన నీకు జన్మకర్మములు యదార్థముగా లేవు. అహంకారమును లేదు. నిష్క్రియుడవగుటవలన నే కర్మయును లేదు. మరియు నిర్మలుడవగుటవలన రాగద్వేషరూపములకు కారణభూతమగు అహంకారమునులేదు.

***యత్త్వం పశ్యతితత్రైక స్త్వమేవ ప్రతిభాససే।***

***కిం పృథగ్భాసతే స్వర్ణాత్కటకాంగదనూపురం॥ 14॥***

బంగారు నగలన్నింటిలోనూ నిండియున్నది స్వర్ణమే వ్యాపించియున్నటుల, నీవు చూచెడి యీ సృష్టియంతటను కారణరూపుడవగునీవే వ్యాపించి ఏకమై స్ఫురించుచున్నావు.

***అయంసోహమయం నాహం విభాగమితి సంత్యజ।***
***సర్వమాత్మేతినిశ్చిత్య నిస్సంకల్పసుఖీభవ॥ 15॥***

విశ్వమంతయును కారణరూపమగు ఆత్మయేఅనునిశ్చయముతో "సోహం,నాహం"నేను నేనుకాను. యిత్యాది బేధ భ్రమనువిడిచి చిద్రూపుడవై, యెట్టిభ్రమయునులేక సుఖముగా నుండుము. ఆత్మేతర మైనద్వితీయ వస్తువున్నదని తలంచుటయేదుఃఖకారణమగును.

***తవైవాజ్ఞానతో విశ్వం త్వమేకః పరమార్థతః।***
***త్వత్తోన్యోనాస్తి సంసారేనా సంసారీచ కశ్చన॥ 16॥***

అజ్ఞాన కారణముగా నీ స్వరూపమును మరిచిపోయి. ప్రపంచ బుద్ధిని పొందినపుడే నీకు యీ దృశ్యవిశ్వమంతయు స్ఫురించును. కాని, మాయచేత కల్పించబడిన యీదృశ్య సముదాయమంతయు ఆత్మ స్వరూపముచేత కారణరూపుడవగునీవే. ఇతడు సంసారి, మరొకతడు ముక్తుడు అను విభజననీకు లేదు.

***భ్రాంతి మాత్రమిదం విశ్వం నకించిదితి నిశ్చయీ।***
***నిర్వాసనః స్ఫూర్తిమాత్రో నకించిదితి శామ్యతి॥ 17॥***

ఈ ప్రపంచము భ్రమకారణముగనేకలుగుచున్నది కాబట్టి ఆత్మసత్తకంటే వేరు సత్తలేదను నిశ్చయము గలవాడు. ఏ విధమైన సంకల్పములు లేనివాడును, వాసనారహితుడును, స్ఫూర్తిమాత్రుడును, నిర్వికారుడనై పూర్ణసంతుష్టుడగును.

***ఏకేవభవాంభోధౌ వాసీదస్తి భవిష్యతి।***
***నతేబంధోస్తి మోక్షోవా కృతకృత్యస్సుఖంచర॥ 18॥***

చావు పుట్టుకలతోకూడిన యీ ప్రపంచమను సముద్రమునందు కాలత్రయమందును. నిత్యుడవైనీవు ఒక్కడవేయున్నాడవు. కనుక నీకు బంధము. మోక్షము యీ రెండునూలేవు. ఇట్టి దృఢ సంకల్పముతో కృతకృత్యుడవై సుఖముగా నుండుము.

***మా సంకల్పవికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ।***
***ఉపశామ్య సుఖంతిష్ఠ స్వాత్మన్యానందవిగ్రహే॥ 19॥***

చిద్రూపుడవగు ఓకుమారా...!సంకల్పములు వికల్పములచేత మనసును క్షోభింపజేయకుము. అన్నింటినీ విడిచి పరమానందరూపమగు ఆత్మయందు రమించుచు ఆనందరూపుడవై ఉండుము.

*త్యజైవ జ్ఞానం సర్వత్ర మాకించిద్ధృది ధారయ।*
*ఆత్మాత్వం ముక్తపవాసి కిం విమృశ్య కరిష్యసి॥20॥*

కుమారా....! నీవు సర్వత్ర ధ్యానమును గూడా విడువుము. ఏమనగా అధిష్టానమగు ఆత్మకంటే వైరైన ధ్యానము కూడా మనసుకు సంబంధించిన వ్యాపారమగుటవలన అది శాశ్వతమైనది కాదు. కాబట్టి యిక నీవు దేనిని ధ్యానించవలయును...? అవిధముగానే మననముకూడా ఆత్మకు యితరము కావున మననముకూడా అక్కరలేదు. ఆత్మస్వరూపుడవగు నీవు ముక్తుడవు. ఈ విధముగా నీవు విచారించుకొందువేని ధ్యానమువలన, మననమువలన ఏ ఫలములునూ లేవు.

## 15వ ప్రకరణము

## తత్త్వోపదేశ వింశతికము సమాప్తము.



# విశేషోపదేశకము.

## 16వ ప్రకరణము - గురుప్రోక్తము.

*ఆచక్ష్వ శృణువాతాత నానాశాస్త్రాణనేకశః*
*తథాపినతవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే॥ 1॥*

కుమారా...! ఎన్నియో శాస్త్రములను యెన్నియో పర్యాయములు నీవుగురు ముఖమున వినినను, మరొకరికి ఉపదేశించినను నీవు సర్వమును మరిచిపోకుండ ఉండుట అను శాంతి కలుగదు. అయితే నిద్రయందు అందరికిని సర్వవిస్మరణము కలుగుచున్నది. సర్వవిస్మరణమెందుకని అనియేదవేని...? నిద్రయందు విషయస్మరణమేకాని దానికి కారణమగు అజ్ఞాన స్మరణములేదు. చిద్రూపుడు స్వాధ్యస్తమగు అజ్ఞానమును తత్కారణ విషయములను మరిచి, కేవల చిన్మాత్రుడై యుండును. ఇచట "సర్వం" అనుపదములవలన "మూలావిద్య" గ్రహింపబడెను. ఈ విద్యా విస్మరణమే ముక్తి అని తాత్పర్యము.

*భోగం కర్మ సమాధిం వాకురువిజ్ఞ తథాపితే,*
*చిత్తం నిరస్త సర్వాశమత్యర్థం రోచయిష్యతి॥2॥*

స్వస్వరూపదర్శి అయిన జ్ఞాని..సర్వభోగముల ననుభవించుచున్నను. సమాధి. నిష్టనున్నను, సర్వకర్మలచేయుచున్నను. సర్వాకారరహితమై సర్వ

విస్మరణమొందిన యీ చిత్తము నశించునట్టి యీదృశ్య ప్రపంచమునందు. రోతచెంది చిద్రూపమునందే అభిరుచికలిగి యుండును.

***ఆయా సాత్సకమలో దుఃఖీసైనంజానాతి కశ్చన,***

***అనేనైవో పదేశేన ధన్యఃప్రాప్నోతినిర్వృతిమ్॥3॥***

జనులందరును శ్రమ కారణముగనే దుఃఖించుచున్నారు. శ్రమయే దుః ఖకారణమని విమర్శించిన జ్ఞాని నిర్వృతిని చెంది ధన్యుడై పరమ సుఖమును పొందును.

***వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి,***

***తస్యాలస్య ధురీణస్యసుఖిం నాన్యస్యకస్యచిత్॥4॥***

ఎవడు నిమేషోన్మేష వ్యాపారమందు సైతము ఆసక్తిలేకయుండునో అట్టి నిస్పృహుడగు మహానీయునికి కలుగు సఖము నేనీపనిచేయవలయును అను దృఢమైన కోరిక గలవానికి కలగదు.

***ఇదంకృతమిదంనేతి ద్వంద్వైర్ముక్తం యదామనః,***

***ధర్మార్ధకామ మోక్షేషు నిరపేక్షంతదాభవేత్॥5॥***

ఈ పనిచేసినాను. ఈ పనిచేయలేదు. మొదలగు ద్వంద్వభావములులేని జ్ఞాని ధర్మార్ధ కామ మోక్షములందును అపేక్షలేనివాడగును. జీవన్ముక్తునకు ద్వంద భావములు కలుగవని భావము.

***విరక్తో విషయ ద్వేష్టారాగీ విషయలోలుపః,***

***గ్రహమోక్ష విహనస్తు నవిరక్తో నరాగవాన్॥6॥***

మోక్షేచ్ఛకలిగి, విషయాదులందు ద్వేషబుద్ధిగలవాడు విరాగియనబడును. కాలమందు ప్రేమకలిగి విషయాసక్తి కలవాడు రాగియనబడును. గ్రహణము. మోక్షేచ్ఛ యీరెండును లేనివాడు విరక్తుడును కాడు. రాగియునుకాడు. దేనియందును కామములేకుండుట చేత సర్వ నిరపేక్షుడగును. అనగా ధర్మార్ధకామములందును, మోక్షమందును కోరికలేనివాడగును. అటువంటి వాడే ముక్తుడు-జ్ఞాని.

***హేయోపాదేయతా తావత్సంసార విటపాంకురః,***

***స్పృహా జీవతి యావద్వైనిర్విచారదశాస్పదమ్॥7॥***

అవివేక దశాస్పదమగుతృష్ణ నిలిచియుండు పర్యంతముహేయోపాదానాది వ్యవహారమనునట్టి సంసార వృక్షశాఖల హరించుచునేయుండును. కావున మనసు, బుద్ధి, చిత్తము, అహంకారములతో కూడిన చిత్తమువాటినుండి దూరమై

యెటువంటి స్పృహయు లేకపోవుటచేత హయోపాదానాది వ్యాపారముండినను సంసార తరుశాఖలంకురింపవు

***ప్రవృత్తౌజాయతే రాగో నివృత్తౌద్వేషఏవహి,***
***నిర్ద్వంద్వో బాలవద్ధీమా ఏవమేవ వ్యవస్థితః॥8॥***

రాగయుక్తమగు ప్రవృత్తి కలదేని, ఉత్తరోత్తర రాగమే కలుగును. విషయాసక్తియందు ద్వేషపూర్వకమగు నివృత్తికలిగెనేని, ఉత్తరోత్తరవిషయములందు ద్వేషమే కలుగును. కనుక జీవన్ముక్తుడు పసిబాలునిలా మంచి, చెడుల విచక్షణమే లేక రాగ, ద్వేషరహితుడై రాగజనితమగు ప్రవృత్తియు, ద్వేషజనితమగు నివృత్తియు లేకయే వర్తించును. అనగా జ్ఞాని ప్రవృత్తి, నివృత్తులు, రాగద్వేషములు శుభాశుభానుసంధానము మొదలగు ద్వంద్వ ప్రవృత్తులెంత మాత్రమునులేక స్థిరుడైయుండును. కేవలము ప్రారబ్ధవశమున ప్రాప్తించుకర్మలయందు ప్రవృత్తి, నివృత్తులు ఉన్నట్లు వర్తించినను రాగద్వేషప్రేరితుడుకాక చిత్తమందు ప్రవృత్తి నివృత్తులు లేకయే కర్మలనాచరించును.

***హాతుమిచ్ఛతి సంసారం రాగీ దుఃఖ జిహాసమా,***
***వీతరాగోహి నిర్దుఃఖ స్తస్మిన్నపి నఖిద్యతే॥9॥***

రాగము కలవాడు సంసారమందు దుఃఖము కలుగు తలంపుతోసంసార త్యాగము చేయగోరును. వీతరాగుడగు జ్ఞానియన్ననో రాగ సంబంధమగు దుఃఖమే లేనివాడుగనుక సంసారమందు ప్రవర్తించుచున్నను దుఃఖితుడుకాడు.

***యస్యాభిమానోమోక్షేపి దేహేపి మమతాతథా,***
***నచజ్ఞానీ నవాయోగీ కేవలం దుఃఖభాగసౌ॥10॥***

నేను జీవన్ముక్తుడను, త్రికాలవృత్తాంతములనెరింగిన వాడను, ముక్తుడను అను అహంకారముతో మోక్షమందు అభిమానముగలవాడు జ్ఞానికానేరడు. ఆ విధముగనే నేనుయోగాభ్యాసిని, నాదేహము సకలగుణ కర్మసామర్థ్యము కలిగినటువంటిది, అధికముగా భుజించుటకుగాని, నిరాహారునిగా ఉండుటకుగాని సమర్థుడను అను దేహాభిమానముగలవాడు యోగియునుకాడు. జ్ఞానియును కాడు దుఃఖకారణములగు అహంభావ మమకారములు నివృత్తి కానందున అట్టి అతడు కేవలము దుఃఖితుడేయగును. సర్వగుణ విస్మరణము కలుగనివాడు జ్ఞానికానేరడని భావము.

*హరోయద్యుదేష్టాతే హరిః కమలజోపివా,*
*తథాపినతవ స్వాస్థం సర్వవిస్మరణాదృతే॥ 11॥*

కుమారా..! త్రిమూర్తులు, బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులు స్వయముగా నీకు ఎంతగా ఉపదేశములందించినను సర్వవిస్మరణము దృశ్యపదార్థములందు ఉపేక్ష లేక నీకు జ్ఞానముకలుగదు.

**16వ ప్రకరణము**

**విశేషోపదేశము సమాప్తము**



# తత్త్వజ్ఞ స్వరూప వింశతికము

## 17వ ప్రకరణము- గురుప్రోక్తము

*తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాసఫలం తదా,*
*తృప్త స్స్వచ్ఛేంద్రియో నిత్యమే కాయః రమతే॥ 1॥*

ఇహ భోగ భాగ్యములను కోరక ఆత్మారాముడగువాడు యోగాభ్యాసఫలమును జ్ఞానఫలమును పొందినవాడగును. కావున అట్టి ఆత్మారాముడు భ్రమతోకూడిన విషయములను కోరక చిద్రూపుడై ఆనందించును.

*నకదా చిజ్జగత్యస్మిన్ తత్త్వ జ్ఞోహంతఖిద్యతి,*
*యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండమండలమ్॥ 2॥*

ప్రియమైన శిష్యా...! ఈ ప్రపంచమునందు తత్త్వజ్ఞాని ఎవడును దుఃఖించడు ఏలయన...! ఆ మహనీయుని ఆత్మవలననే యీ విశ్వమంతయూ వ్యాప్తిచెందియున్నది. ఆ ఆత్మకంటే మరొక వస్తువు యేదియును లేదు . కనుక అతనికి దుఃఖమే లేదు.

*నజాతు విషయాః కేపిస్వారామం హర్షయంత్యమీ,*
*సల్లకీ పల్లవ ప్రీతమివేభం నింబపల్లవా॥ 3॥*

సదా ఆత్మయందే క్రీడించువాడు స్వాత్మారాముడనబడును. అటువంటి మహాత్ముడు యింద్రియములకు లోబడడు కనుక. ఆత్మశక్తికన్న యితర సత్తలేని హీనములగు విషయ సుఖములకు ఆనందించడు. తీయని యిందుగు

చిగురుటాకులను తినుటలో ఆసక్తిని కనపరచు యేనుగు చేదుగా నుండు వేపచిగురును కోరనివిధముగా స్వాత్మలో సుఖించు జ్ఞాని హేయమ్మైన విషయాసక్తులకానందించడు.

***యస్తుభోగేషు భుక్తేషు నభవిత్యధివాసితా,***
***అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశోభవ దుర్లభః॥4॥***

ప్రాప్తించిన సుఖములందనురక్తి, అప్రాప్తభోగములందాసక్తియును లేక సర్వదా చిద్రూపుడై విహరించు జ్ఞాని యీలోకమందు కోటికి ఒకడు ఉండడు.

***బుభుక్షురిహసంసారే ముముక్షురపి దృశ్యతే,***
***భోగ మోక్ష నిరాకాంక్షీ విరలోహి మహాశయః॥5॥***

ఈ విశ్వము నందు సాధువులు, యతులు, మొదలగు వేషదారలు, కొందరశనాపేక్షులై "బుభుక్షువులుగను" కొందరు మోక్షానక్తులై "ముముక్షువులుగను" కనుపింతురు. కాని....! భోగమోక్షములు రెండింటియందును ఏవిధమైన కోరికయును లేక సర్వదా సచ్చిదానంద రూపులై చరించు మహాత్ములరుదుగదా...!

***ధర్మార్ధ కామమోక్షేషు జీవితేమరణే తథా,***
***కస్యాప్యుదారచిత్త స్వహేయోపాదేయతానహి॥6॥***

పురుషార్ధములగు ధర్మార్ధకామ మోక్షములందును, జీవన్మరణ ములందును హేయోపాదేయవృత్తిలేక, అనగా ప్రతి వ్యక్తి కోరతగిన ధర్మార్ధ కామ జీవితములందు ఆసక్తి, కోరతగని మరణమందు భయమును లేక అన్నిటి యందును సమబుద్ధి, అనాసక్తియు గల బ్రహ్మజ్ఞాని కోటికొకరునులేరు.

***వాంఛా నవిశ్వవిలయే నద్వేషన్తస్యచస్థితౌ,***
***యథా జీవికతు తస్మాద్ధన్య ఆస్తే యధాసుఖమ్॥7॥***

విశ్వమంతటికినీ మూలకారణమగు బ్రహ్మము మాత్రమే గోచరించునట్లు జ్ఞానికి ప్రపంచనాశముగాని , ప్రపంచ స్థితియందు గాని వాంఛా ద్వేషములు లేవు. ఆ స్థాయియిని పొందిన మహాత్ముడు ప్రారబ్ధ లబ్ధమగు విషయ వాంఛలందు నిర్లక్షుడై సర్వదా సచ్చిదానంద స్వరూపుడై జీవనము సాగించును.

***కృతార్థోనేన జ్ఞాననేత్యవం గలితధీః కృతీ,***
***పశ్యన్నృణ్వన్ స్పృశఞ్జిఘ్నన్నశన్నాస్తేయదా సుఖం॥8॥***

"నేను యీ అద్వైతాత్మ జ్ఞానము చేతనే కృతార్థుడనైతిని అనెడు సంకల్పమైనను లేకుండ, నిత్యకృత్యముల నేరవేర్చుచున్నను చిద్రూపుడుగనే యుండును. అతడు కృతకృత్యుడు కనుక అజ్ఞానివలెను రాగయుక్తునివలెను బాహ్యేంద్రియ వ్యవహారములు చేయుచున్నను దుఃఖితుడుకాడు.

***శూన్యదృష్టి ర్వృథా చేష్టా వికలానింద్రియాణిచ,***
***నస్పృహా నవిరక్తి ర్వాక్షీణ సంసారసాగరే॥9॥***

ప్రాపించిక దృష్టియేలేని జ్ఞాని క్షీణసంసార సాగరుడని అనబడును. అట్టిమహనీయునకు విషయ స్పృహ ఉండదు. అతని మానసిక చర్యలు, దైహిక చేష్టలు. భాహ్య అంతరింద్రియ వ్యాపారములు పిశాచమావహించిన బాలుని చర్యలవలనె శూన్యముగా నుండును. అతని దృష్టి, మనోవ్యాపారము సంకల్ప, వికల్పరహితములుగా ఉండును.

***న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి నమీలతి,***
***అహో....!పరదశాక్వాపివర్తతేముక్తిచేతసః॥10॥***

జ్ఞానికి సర్వజనసామాన్యమగు జాగ్రదవస్థలేదు. బాహ్యవిషయములతో సంబంధమే లేని కారణముగా కనురెప్పలు మూయుట, తెరచుట నెరుగడు నిద్రకూడా ఉండదు. సర్వకాల, సర్వావస్థలయందు సర్వమును బ్రహ్మ పదార్థముగనే చూచుచున్నవాడు కావున జాగృత్, సుషుప్త్యావస్థలయందు, నేత్రోన్మీలన నిమీలమందును. స్పృహలేక ఉన్మత్తునివలె ప్రవర్తించును (కనులుమూయుట, తెరచుట). ఓహో...! ఇట్టి ముక్తచేతనుడగు జ్ఞాని సర్వదా ఉత్కృష్టము, మహోన్నతమగు తురీయాతీత స్థితియందే ఉండునుకదా...!

***సర్వత్ర దృశ్యతే స్వస్థ స్సర్వత్ర విమలాశయః,***
***సమస్త వాసనో ముక్తోముక్త సర్వత్ర రాజతే॥11॥***

అటువంట మహానీయుడు సుఖదుఃఖములు సంభవించినపుడు చలించనివాడై శత్రువులను, మిత్రులను సమానముగా చూచుచు ఏవిధమైన విషయవాంఛలకు లోబడక సర్వ అవస్థలయందును చిద్రూపుడై భాసించును.

***పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నృహ్ణన్వదన్వ్యస్వ ప్రజన్,***

***ఈ హితా నీహితైర్ముక్తో ముక్తఏవ మహాశయః॥ 12॥***

ఇంద్రియములకు సంబంధించిన చూచుట,వినుట తాకుట భుజించుట వాసనచూచుట మొదలగు ప్రారబ్ధమువలన కలుగు వ్యవహారములు జరుపుచున్నను. వాటి యందిష్టము, అయిష్టములులేని మహాత్ముడు మనోవికారములులేని వాడు కనుక అతడు ముక్తుడే..!

***ననిందతి నచస్తౌతి నహృష్యతి, నకుప్యతి,***

***నదదాతి నగృహ్ణాతి ముక్తసర్వత నీరసః॥ 13॥***

అటువంటి మహాత్ముడు పొగడ్తాతెగడ్తలు, దుఃఖసంతోషములు, దాన ప్రతిగ్రహణములు లేనివాడై దేనియందును సంగము లేనివాడై సర్వత్ర చిద్రూపుడై విలసిల్లును.

***సానురాగాంస్త్రియం దృష్ట్వా మృత్యుంవాసముపస్థితం,***

***అవిహ్వల మనాః స్వస్థోముక్త ఏవమహాశయః॥ 14॥***

అటువంటి మహాత్ముడుగుజ్ఞాని తనయందనురాగమును ప్రదర్శించు స్త్రీలనుగాంచిమోహపరవశుడు కాడు. భయంకరమగు మృత్యుభయమతనికి ఉండదు. నిశ్చలచిత్తుడగు అట్టి జ్ఞాని తప్పక ముక్తుడేయగను-

***సుఖేః దుఃఖే నరే నార్యాం సంపత్సుచ విపత్సుచ,***

***విశేషోనైవ ధీరస్వ సర్వత్ర సమదర్శినః॥ 15॥***

విశ్వమంతను స్వయం ప్రకాశబ్రహ్మమునే చూచుచుండుజ్ఞాని సుఖదుః ఖములందు స్త్రీ, పురుషులందు. సంపదలు, ఆపదలయందు యేవిధమైన వికారమును పొందక నిశ్చలుడైయుండును.

***నహింసానైవకారుణ్యం నౌర్ధత్యం నచదీనతా,***

***నాశ్చర్యంనైవచక్షోభః క్షీణసంసరణే నరే॥ 16॥***

దేహేంద్రియ వ్యహారస్ఫురణమును తనుమానవుడనను ఊహను, సదాచిద్రూపములో ఉండు జ్ఞాని పరహింస, కరుణ, ఉన్నతము, దీనత్వము ఆశ్చర్యము, క్షోభము, మొదలగు అంతరింద్రియ వికారములనొందడు.

***సముక్తో విషయద్వేష్టానవా విషయలోలుపః***

***అసంసక్తమనానిత్యం ప్రాప్తప్రాప్తముపాశ్నుతేః॥ 17॥***

తురీయ స్థితికి చేరిన వానికి విషయవాసనలయందు ద్వేషముగాని ఆసక్తికాని ఉండదు. అన్నిటియందును అనాసక్తుడై ప్రారబ్ధము వలన లభించిన భోగ భాగ్యములను అనుభవించును.

***సమాధానా సమాధాన హితాహితవికల్పనా,***

***శూన్యచిత్తోనజానాతి కైవల్యమివ సంస్థితః॥ 18॥***

పరిసర జ్ఞానములేని చిద్రూపునకు హితము,అహితము, సమాధానము విక్షేపము యిత్యాది వివిధ భ్రమలు కలుగవు. అటువంటి జ్ఞాని విదేహముక్తిని పొందినవానివలెనే జీవన్ముక్తుడై తరించును.

***నిర్మమో, నిరహింకారో నకించిదితి నిశ్చితః,***

***అంతర్గలిత సర్వాశః కుర్వన్నపికరోతిన॥ 19॥***

అహంకారమమకారములను విసర్జించి, ఆత్మ సత్తకంటే వేరేవి యితరమును లేదని నిశ్చయించి దేనిని ఆకాంక్షించని జ్ఞాని యేకార్యములు నిర్వహించుచున్నను. కర్తృత్వము వానియందు. అభిమానములు లేనివాడగుటచే ఏమియును చేయని వాడేయగును.

***మనంఃప్రకాశ సమ్మోహః స్వప్నజాడ్యవివర్జితః,***

***దశాం కామపి సంప్రాప్తోభవేద్గలిత మానసః॥20॥***

శూన్యవృత్తితోకూడిన మనస్సు ఆత్మలోలయించిన జ్ఞానికి మాటలకుఅందని ఆనంద దశ సంప్రాప్తమగును. అప్పుడతడు మనస్సేలేని వాడును యింద్రియ వ్యవహార శూన్యుడునూ, యీ మిథ్యాకల్పిత విశ్వస్వప్నమును విడిచిన వాడును అజ్ఞాన సుషుప్తి లేని వాడునుయై సర్వదా సచ్చిదానంద స్వరూపుడై జాగరూకుడై యుండును.

## 17వ ప్రకరణము.

## తత్త్వజ్ఞ స్వరూప వింశతికము సమాప్తము



# శాంతిశతకము

## 18వ ప్రకరణము - గురుప్రోక్తము

***యస్యబోధోదయే తావత్స్వప్నవద్భవతిభ్రమః,***

***తస్మై సుఖైకరూపాయ నమశ్శాంతాయ తేజసే॥ 1॥***

జ్ఞానిగా మారినంతనే అతనికి అంతకు ముందున్న ప్రపంచ భ్రమ కేవలము స్వప్నమువలే హేయముగా తోచి సంకల్పములు వికల్పములు లేనివాడై

చిద్రూపుడై, సచ్చిదానంద స్వరూపుడై తేజరిల్లుచుండునో అట్టి జ్ఞానకి నమస్కారము

***ఆర్జయిత్వాఖిలా నర్థాన్భోగా నాప్నోతిపుష్కలాన్,***
***నహిసర్వపరిత్యాగామంతరేణ సుఖీభవేత్॥ 2 ॥***

శ్రీమంతుడు ధన,ధాన్యకళాత్రాదులను పొందుపరచుకొని ఎన్నో విధములైన భోగములను అనుభవించుచుండగలడు. కాని అతడు సుఖైక రూపుడు కాడు. కారణమేమనగా అతడు ఆర్జించినవి నశించినయెడల దుఃఖమును పొందును కాబట్టి సర్వసంకల్ప, వికల్పత్యాగములేనిచో అతడు సుఖైక రూపుడు కాజాలడు. ఇది నిశ్చయము.

**కర్తవ్య, దుఃఖ మార్తాండజ్వాలా దగ్ధాంతరాత్మనః**
***కుతః ప్రశమపీయూక్షధారాసారామృతే సుఖమ్ ॥3॥***

చేయతలచిన పనులను చేయవలెనను అహంభావము వలన కలుగు సంతాపమే తీవ్రమగు గ్రీష్మఋతుమార్తాండ జ్వాలయనబడును. అటువంటి తీవ్ర సంతాప జ్వాలవలన దహింపబడుచున్న మనస్సు గలవాడు సంకల్ప, వికల్పములను విసర్జించుటయును అమృత ధారలయొక్క జడివానచే తడవకుండసుఖించలేడు.

***భవోయం భావనామాత్రో నకించిత్పరమార్థతః***
***నాస్త్యభావోహి భావానాం భావా భావ విభావినామ్॥4॥***

ఈ సంసారము సంకల్పకారణముగా కలుగుచున్నది. పరమార్థ తత్త్వవిచారణచేత యీ సంసారము ఆత్మయందే కల్పించబడినది కనుక యిది ఆత్మకన్న భిన్నముకాదు. భావనామాత్రమున సిద్ధమగుచు భావనానివృత్తి కలుగగనే యీ సంసారము అను భ్రమ మాయమగుచున్నది. వాసుదేవస్సర్వం "అనుభగవంతుని వాక్యానుసారము సర్వవిశ్వమును ఆత్మస్వరూపమే. కాని యిది. భ్రమ యగుటవలన , సంకల్ప, వికల్పముల కారణముగా జన్మించినదగుటవలన ఒక నాటకములోని పాత్రలవలెను. స్వప్నములోకనిపించు వింత దృశ్యముల వలెను భ్రమ కలిగించి, వ్యామోహమును కలిగించుచున్నది. ఈ వ్యామోహములో చిక్కినచో జననమరణములతో కూడిన సంసారము అంతకంతకు విజృంభించును. కావున సంసారోత్పత్తి భ్రమమకారణభూతమైన సంకల్ప, వికల్పముల నిర్మూలన జరిగినగాని యీ భవ బంధవిముక్తి తద్వారా మోక్ష ప్రాప్తి కలుగదని భావము.

***నదూరం నచ సంకోచాల్లబ్ధమేవాత్మనః పదం।***

***నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్॥5॥***

ఆత్మసర్వపరిపూర్ణమైనది కనుక దూరమునలేదు. ఇది ఒక దానియందుయి మిడి యున్నదికాదు. కావున యిది నిత్య ప్రాప్తమయ్యేయున్నది. తన మెడయందు గలహారము మెడలోనే ఉన్నదని గ్రహించక వెదుకుకొను మూఢునిలా అజ్ఞానులు సంకల్పములకు వశులై ఆత్మప్రాప్తి కలుగలేదనితలచెదరు. అనగా సంకల్పరహితులగు జ్ఞానులకు ఆత్మ నిత్యప్రాప్తమే। ఆత్మ నిర్వికల్పము. నిరాయాసము, నిర్వికారము, నిరంజనము కావున యిది నిర్వికల్పులకు నిత్య ప్రాప్తమయ్యేయున్నది.

***వ్యామోహమాత్రావిరతౌ స్వరూపోదానమాత్రతః।***

***వీతశోకా విరాజంతే నిరావణదృష్టయః॥ 6 ॥***

శాస్త్రములను అభ్యసించుటవలనను లేదాగురూపదేశమువలనను కలిగిన విజ్ఞానముచేత ప్రపంచభ్రాంతి తొలగగనే ఆత్మవిశ్రాంతి కలిగినకారణంగా దుఃఖములేని వాడై ఏప్రయత్నములేకనే సర్వదా స్వభావముచేత అద్వితీయ పరిపూర్ణాత్మస్వరూపుడై విలసిల్లును.

***సమస్తం కల్పనామాత్ర మాత్మాముక్తస్సనాతనః।***

***ఇతి విజ్ఞాయధీరోహి కిమభ్యస్యతి బాలవత్॥ 7॥***

దేహాది సర్వప్రపంచము ఆత్మయందు కల్పితము. ఆత్మసనాతనము నిత్యముక్త స్వరూపము. ఈ విధమైన తత్త్వమును దృఢముగ తెలుసుకొనిన జ్ఞానములేని బాలునికి వలె తెలుసుకొనతగిన దేదియును ఉండదు.

***ఆత్మాబ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌచ కల్పితౌ।***

***నిష్కామః కింవిజానాతి కింబ్రూచకరోతి కిమ్॥ 8॥***

"త్వం" పదార్థమగు జీవాత్మ "తత్" పదార్థమగు పరబ్రహ్మకంటే వేరుకాదను దృఢనిశ్చయముకలిగి ఆత్మసాక్షాత్కారముపొంది, దృశ్యములగు ఘటాదులు వీని అభావములు కల్పితములని నిశ్చయించి వీనిని పొందుటకు కారణమైన అవిద్యను తొలగించి నిష్కాముడై సర్వదా ఆత్మారాముడై యుండు చిద్రూపునకు తనకంటే అన్యముగ తెలియతగినదేదియునులేదు.

***అయం సోహమయం నాహమితిక్షీణ వికల్పనాః।***

***సర్వమాత్మేతి నిశ్చిత్య తూష్ణీం భూతస్సయోగినః॥ 9॥***

మనస్సునందెట్టి సంకల్పములు లేకుండ క్షేత్రజ్ఞుడను జీవుని పరమాత్మయందులయమొనరించుటయే యోగమనబడును ఆవిధముగా

బాహ్యాంభ్యంతర వ్యాపారములన్నియు మరిచి, ఆత్మయే సర్వమను దృఢానుభవముగలయోగికి సంకల్పములన్నియు తమకు తాముగనే క్షీణించును. నేను చేయుచున్నాను 'సోహం' అని నేను ధ్యానముచేయుచున్నాను. నేను కదులుచున్నాను. కదులుటలేదు. యిటువంటిమనోవికల్పములన్నియు నశించగా ఆత్మేతరవృత్తిశూన్యుడగువాడు పరబ్రహ్మమే తానగునని భావము...

*నవిక్షేపో నచైకాగ్ర్యం నాతిబోధోనమూఢతా౹*
*న సుఖం న చవాదుఃఖ ముపశాంతస్సయోగినః౹౹ 10 ౹౹*

సంకల్ప వికల్పములులేని యోగికి చిత్తచలనము ఉండదు. చిత్త నిరోధము, సమాధి. అజ్ఞానము, సుఖము, దుఃఖము మొదలగు వృత్తులు ఎంత మాత్రమును ఉండవు.

*స్వారాజ్యే భైక్షవృత్తౌచ లాభాలాభే జనే వనే౹*
*నిర్వికల్పస్వభావస్య నశేషోస్తి యోగినః౹౹ 11 ౹౹*

ఆ విధమైన సంకల్పశూన్యడగు యోగికి స్వర్గరాజ్యమబ్బినను, భిక్షకుడై ప్రారబ్ధవస్తువును పొందినను, పొందకున్నను, జనసమూహమందున్నను, జనారణ్యమందున్నను భేదమెద్దియును లేదు.

*క్వధర్మః క్వచవాకామః క్వచార్థః క్వవివేకితౌః*
*ఇదంకృతం మిదంనేతి ద్వంద్వైర్ముక్త స్వయోగినః౹౹ 12 ౹౹*

ఏమిచేయునో, ఏదిమానునో అను ద్వంద భావములులేని యోగికి అవిద్య, కామము. సంకల్పములు నశించినందున ధర్మార్థకామములు మోక్షోపాయమునకగు వివేకమును ప్రయోజనములేదు.

*కృత్యం కిమపినైవాస్తి నకాపి హృదిరంజనా౹*
*యధాజీవన మేవేహ జీవన్ముక్తస్సయోగినః౹౹ 13౹౹*

జీవన్ముక్తుడగు యోగికి సంకల్పవశమున చేయతగిన కార్యమేదియు లేదు. మనసులో రాగద్వేషములుండవు. రాగాదులకు కారమగు అవిద్యయే ఉండదు. కావున ఎద్లబండిలోని యజమాని నిద్రించుచున్నను ఎద్లు ఆ బండిని అతని స్వగృహమునకే చేర్చునట్లు చిద్రూపునకు దేహధారణకనువైన సర్వక్రియలు యింద్రియములద్వారా అప్రయత్నముగనే జరుగుచుండును. అయినను ఆ విధమైన యింద్రియ వ్యాపారములకు అతీతుడగనే ఉండును.

**క్వమోహః క్వచవావిశ్వం క్వతద్ధ్యానం క్వముక్తతా।**

**సర్వసంకల్ప సీమాయాం విశ్రాంతస్య మహాత్మనః॥ 14॥**

అన్ని ఆలోచనలకు, కోరికలకు మూలమగుమనస్సు ఆత్మలో లయమైయుండు యోగికి మోహము, ప్రపంచస్థితి, ధ్యానము, ముక్తత, మొదలగువానితో ఏమియును ప్రయోజనము లేదు.

**యేన విశ్వమిదం దృష్టం సనాస్తీతికరోతువై।**

**నిర్వాసనః కింకురుతే పశ్యన్నపిన పశ్యతి ॥15॥**

సాధారణముగా మానవుడు సర్వప్రపంచమును చూచి చిత్తమునందు ఆప్రపంచ వస్తు సముదాయమంతయు మిథ్యయని మాత్రము విచారణ తర్వాత తెలుసుకొన్నాడు. కాని చూచుచుండియు చూడని, విషయవ్యవహార స్పృహలేని యోగి వాసనాశూన్యుడగుటజేసి,అతడు చేయునదేదియునులేదు.

**యేన దృష్టం పరం బ్రహ్మ సోహంబ్రహ్మేతిచింతయేత్।**

**కించింతయతినిశ్చింతో ద్వితీయం యోన పశ్యతి ॥ 16 ॥**

పరబ్రహ్మతత్త్వము తనకన్నవేరుగానున్నట్లు తలచుముముక్షువు "అహం బ్రహ్మాస్మి" అని ఆలోచించును కాని తనకంటే ఆత్మకంటే యితరమేదియును చూడని, అన్నిచింతలకు ఆలోచనలకు దూరుడైన యోగి దేనిని చింతింపడు. అద్వితీయాత్మానుభవశాలి అనగా యోగారూఢునకు బ్రహ్మవిషయక చింతనముకూడా లేదని భావము.

**దృష్టోయేనాత్మ విక్షేపో నిరోధం కురుతేత్వసౌ।**

**ఉదారస్తునవిక్షిప్తః సాధ్యాభావాత్కరోతికిం ॥ 17 ॥**

ఆలోచనలు కోరికలు భ్రమ రూపకములుగ భావించు ఆత్మజ్ఞుడు తన చిత్తమును వాటిపైకి మరల్చు ప్రక్రియను నిరోధించును. ఆత్మతప్ప మరొకటిలేదని భావించు జ్ఞానికి మనోచలనమే ఉండదు. కావున అటువంటి జ్ఞానికి మనస్సు చలించకుండ ఉంచగల సమాధి కూడా అక్కరలేదు.

**ధీరోలోక విపర్యస్తో వర్తమానోపి లోకవత్।**

**నసమాధిం నవిక్షేపం నలేపం స్వస్యపశ్యతి ॥18॥**

ఎల్లప్పుడునూ చిద్రూపుడై, అద్వితీయాత్మ విశ్రాంతుడగు యోగి, పరమాత్మయందు సైతము స్ఫురణము. లక్ష్యమున్నట్లు సైతము లేకుండా స్వాత్మారాముడగు జ్ఞాని ప్రపంచవాసనలు లేనివాడై సామాన్యమానవుని వలె

ప్రారబ్ధవశమగు నిత్యకృత్యములు నిర్వహించుచున్నను వాటి స్ఫురణమే లేక యుండును. అటువంటి జ్ఞానికి సమాధి. మనోచలనము. మొదలుగునవి ఉండవు.

***భావాభావ విహీనో యస్తృప్తో నిర్వాసనో బుధః।***
***నైవకించిత్కృతే నలోకదృష్ట్యా విహర్వతా ॥ 19॥***

సచ్చిదానంద స్వరూపుడై ఏవిధమైన ఆలోచనలు కోరికలు లేక యింద్రియ వాసనలకు దూరుడై యుండు జ్ఞాని, కర్తృత్వధ్యాసలేనివాడు కావున, ప్రపంచదృష్టిలో అందరివలె వ్యవహరించుచున్నను. వ్యవహరించనివాడేయగును. కర్తృత్వవము లేని యోగి యగుటచే కర్తృత్వము ధ్యాసలేని వాడగును.

***ప్రవృత్తౌవా నివృత్తౌవానైవ ధీరస్సదుర్గ్రహః।***
***యదాయత్కర్తుమాయాతి తత్కృత్వాతిష్ఠ తస్సుఖం॥20॥***

ధీరునకు చిద్రూపుడైన జ్ఞానికి ప్రారబ్ధవశములగు కర్మలు చేయునపుడుగాని, ఊరకుండినపుడుగాని కర్తృత్వధ్యాసలేదు. ఏపని చేయుచున్నను. మానినను అప్రయత్నములోనే ఆయా పనులు జరుగుచుండ వాటియందు యెట్టి స్పృహలేక సచ్చిదానంద స్వరూపుడై విలసిల్లును. జ్ఞాని కర్మలు చేయుచున్నను కర్తృత్వాభిమానములేదుకనుక చేయనివేయగును.

***నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛంధో ముక్తబంధనః।***
***క్షిప్త స్సంస్కారవాతేన చేష్టతే శుష్క పర్ణవత్ ॥21॥***

సంకల్పవికల్పములు లేని వాసనాశూన్యుడు, రాగద్వేషములు లేనివాడు, బంధములకు కట్టుబడనివాడునగు జ్ఞానిప్రారబ్ధకర్మలకు కట్టుపడి చలించక వ్యవహరించును. కర్మలఅనుభవము అతనిని బంధించదు. గత జన్మవాసనలు అనుభవించనిచో నశింపవు కనుక ఎటువంటి రాగద్వేషములకు లోనుకాకుండా నిర్లిప్తుడై కర్మానుభవములను సాక్షిమాత్రుడిగా ఉండి గమనించుచుండును.

***అసంసారస్యతు క్వాపి నహర్షో నవిషాదితా।***
***సశీతల మనానిత్యం విదేహ యువరాజతే॥22॥***

సంసారిక వ్యవహారములకు దూరుడైనవాడు 'అసంసారి' అనబడును. అట్టి అసంసారి యగు చిద్రూపునకు ఏవిధమైన సుఖ దుఃఖములుండవు. కావున అటువంటి జ్ఞాని శాంతచిత్తుడై షడూర్ములులేని శివస్వరూపుడై విలసిల్లును (షడూర్ములనగా శోకమోహములైనమనోధర్మములు దేహధర్మములగు జరామరణములు, ప్రాణధర్మములగు క్షుత్పిపాసలు యీ ఆరును షడూర్ములు) యీ షడూర్ములు శివునకుండవు.

***కుత్రాపి నజిహాసాస్తి నాశోవాపి కుత్రచిత్‌।***
***ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః॥ ॥23॥***

సచ్చిదానంద స్వరూపుడై చలించని చిత్తము కలవాడు ధీరుడు. అటువంటి వాడు అతి నిర్మల మనస్సు గలవాడుగుట చేత "శీతలాచ్ఛతరాత్మ" శాంత స్వభావుడనబడును. అట్టి జ్ఞానికి రాగద్వేషములు లేవు కనుక అతనికి జిహాసయును లేదు. అనగా దేహేంద్రియాదులయందు అనురక్తి గాని దేహనాశనమందు భీతిగాని కలుగవు అన్ని అనర్ధములకు హేతువగు అజ్ఞానమే లేనందున అతడు సచ్చిదానంద స్వరూపుడై విలసిల్లుచుండును.

***ప్రకృత్యా శూన్య చిత్తస్యకుర్వతో స్వయదృచ్ఛయా।***
***ప్రాకృతస్సేవ ధీరస్య నమానో నావమానితా॥ 24 ॥***

స్వాభావికముగ చిత్తవికారములు లేనివాడు. ఆత్మ విశ్రాంతుడునగు జ్ఞాని సామాన్యునిలా ప్రారబ్ధవశమగు కార్యక్రమములందు వ్యవహరించినను అతనికి మనసుయందు సన్మానము, అవమానము అను అనుసంధానమే ఉండదు.

***కృతందేహేనకర్మేదం నమయాశుద్ధరూపిణా।***
***ఇతిచింతానురోధీయః కుర్వన్నపి కరోతిన॥25॥***

దశేంద్రియములతో కూడిన శరీరముచేయు పనులయందు కర్తృత్వభావమిసుమంతైననులేక, సాక్షిమాత్రుడిగనుండి నిరంతరము చిద్రూపుడుగా నుండు జ్ఞానియే పనిచేయుచున్నను చేయనివాడేయగును.

***అతద్వాదీవకురుతే నభవేదపి బాలిశః।***
***జీవన్ముక్తస్సుఖీ శ్రీమాన్ సంసరన్నపిశోభతే॥26॥***

చిద్రూపుడగుధీరుడు నేను యీకార్యము చేయుచున్నాను అనుకోరికలేకుండగనే యేపనినైనను చేయును. ప్రారబ్ధవశమున ఆవిధముగా (అనగా కోరికతో చేసినను) మనసు నిర్మలమగుటంజేసి అతడు మూర్ఖుడుకాడు. అటువంటి జ్ఞాని సంసార వ్యవహారమందున్నను ఆ సంసార దుఃఖములను అంటకుండ ఆత్మ సుఖమునే అనుభవించుచుండును. కాబట్టి అతడు ఎల్లప్పుడును ప్రసన్నుడై ఆత్మ ప్రకాశమున విలసిల్లుచుండును.

***నానావిచార సుశ్రాంతో ధీరో విశ్రాంతి మాగతః।***
***నకల్పతే నజానాతి నశృణోతి నపశ్యతి॥27॥***

ఎన్నోరకాల విచారములవలన శ్రమపడి అలసిపోయి వాటినుండి విడుదల పొందిన జ్ఞాని ఆత్మయందే సుఖించుచుండుటచేత సంకల్పములు

యిత్యాది మానసిక వికారములకు దూరముగా ఉండగలడు. కర్తృత్వాభిమానము వదిలిన వాడగుట చేత ఆతనికి బుద్ధి. శ్రవణేంద్రియాది యితర వ్యాపకములుండవు.

***అసమాధే రవిక్షేపాన్నముముక్షుర్నచేతసః***

***నిశ్చిత్య కల్పితం పశ్యన్బ్రహ్మైవాస్తే మహాశయః॥28॥***

జ్ఞానిమోక్షాసక్తుడుకాడు. అతనికి మరోవిషయమందు భ్రమలేనివాడుకనుక జ్ఞానముకొరకు సమాధి. యోగము మొదలగు కర్మలనాచరించడు. ఆత్మ తప్ప మిగతా వస్తుసముదాయమంతయూ కల్పితములని అంతకుముందే దృఢనిశ్చయ ముగలవాడు కనుక చిద్రూపుడైన ఆ ధీరుడు కేవల బ్రహ్మమైవిలసిల్లును.

***యస్యాంత స్స్యాదహంకారో నకరోతి కరోతిసః***

***నిరహంకారధీరేణ నకించిదకృతకృతమ్॥29॥***

ఎవరి అంతఃకరణమందు అహంకారము తిష్టవేసుకొనియుండునో వాడు ప్రపంచదృష్టికి ఏమీచేయనివాడుగా కనుపించినను. నేనేమియును చేయుటలేదు. అనుకర్తృత్వాధ్యాసము కలిగినవాడగుటచేత చేసిన వాడే అగును. కర్తృత్వభావమే లేని జ్ఞాని సంఘదృష్టికి కార్యములనాచరించుచుండినను, ఏ విధమైన కార్యాచరణ దృష్టి ఆతని అంతరంగములో లేని కారణమున అతడు ఏమియును చేయనివాడేయగును.

***నోద్విగ్నం నచసంతుష్ట మకర్తృస్పంద వర్జితమ్।***

***నిరాశం గతసందేహం చిత్తం ముక్తస్సరాజతే॥30॥***

జ్ఞాని యొక్క మనస్సు కేవల ప్రకాశమానమై విరాజిల్లుచుండును. అతనికి చిత్తచాంచల్య కారణముగా ద్వేషముగాని, సంతోషకారణమైన అనురాగముగాని ఉండవు. ఆతడు సంకల్ప, వికల్పములను ఒదిలినవాడగుటచేత మనసులో చలనముండదు. అందువలను ఆతడు అన్నివిధములగు. ఆశలకు దూరముగా ఉండగలడు. అన్ని సందేహములకు కారణము అవిద్య. అది అతనికి లేనందున అతనికి ఏ సంశయమున్నూలేదు.

***నిర్ధ్యాతుంచేష్టితుంవాపి యచ్చిత్తం నప్రవర్తతే।***

***నిర్నిమిత్తమిదంకింతు నిర్ధ్యాయతి విచేష్టతే॥31॥***

చిద్రూపుడు ఏమీచేయకుండా ఊరుకున్నను. ప్రారబ్ధ లబ్ధ వ్యవహారము సలుపుచున్నను అతని మనసు ఎప్పుడునూ సంకల్పములు లేకుండా ఉండును.

మరియు అట్టి సచ్చిదానంద స్వరూపుడు ఒక్కొక్క పర్యాయము నిశ్చలుడగును. మరొక పర్యాయము. క్రియాశీలుడుగను కనుపించును. అయినను ఆతడు కర్మబంధమునముక్తుడు.

***తత్త్వం యదార్థ మాకర్ణ్యమందః ప్రాప్నోతిమూఢతాం।***

***అథవాయాతి సంకోచః మమూడః కోపి మూఢవత్॥32॥***

అవిద్యతో కూడినవాడు 'తత్ త్వం' ఐక్యతను సద్గురవుద్వారా విని దానిని సరిగా తెలిసికొనక, వ్యతిరేకముగా గ్రహించి వివేకము లేనివాడగును. కాని కొన్నివేల మందిలో ఒక్కడు మాత్రము అంతర్యమున చిద్రూపుడై బాహ్యమునకు మాత్రము. మూర్ఖుడుగా వ్యవహారించును.

***ఏకాగ్రతా నిరోధోవా మూఢై రభ్యస్యతే భృశమ్।***

***ధీరాః కృత్యం నపశ్యంతి సుప్తవత్స్వపదేస్థితాః॥33॥***

ఇతర విషయముల పైకి మనసును మళ్ళించకుండా లక్ష్యము నొక్కదానిని గురించియే ధ్యానము చేయుట ఏకాగ్రత అనబడును. ఈ విధమైన యేకాగ్రత గాని చిత్తమును శాసించుట గాని, ఆత్మ సాక్షత్కారమును గాని పొందని అజ్ఞానులు విరుద్ధ భావమును కలుగకుండ శ్రద్ధతో అభ్యసించెదరు. నేనే దేహమను విపరీత భావనలేని జ్ఞానులు సచ్చిదానంద స్వరూపులై పైన ఉదహరించిన యేకాగ్రత- చిత్తమును స్వాదీన పరచుకొనుటయు మొదలగు వాటికై అభ్యాసమును కొనసాగించరు. చిద్రూపునకు అసంభావనము , విపరీత భావనము కలుగక స్వస్వరూప ప్రకాశమే. స్ఫురించుచుండును.

***అప్రయత్నాత్పయత్నా ద్వామూఢో నాప్నోతి నిర్వృతిం।***

***తత్వనిశ్చయమాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః॥34॥***

చిద్రూపుడుకాని వాడు. చిత్తనిరోధము వలనగాని. కర్మలనాచరించుట వలనగాని సుఖమును పొందలేడు. ఏలయన అతనికి ఆనందానుభూతికి కారణమగు సచ్చిదానందానుభూతి లేదు. జ్ఞాని సమాధి. జపతపాదులు. లేకుండగనే తత్త్వజ్ఞానము దృఢపడినంతనే దుఃఖ హేతువను అజ్ఞానమునశించుటతో అతడు సచ్చిదానంద స్వరూపుడై విలసిల్లును.

***శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం నిః ప్రపంచం నిరామయమ్।***

***ఆత్మానంతం నజానంతి తత్రాభ్యాస పరాజనాః॥35॥***

ఈ విశ్వమందు హఠయోగమభ్యసించుటవలనను. ఖేచరీ, శాంభవీ మొదలగు ముద్రలను సాధించుటవలనను ఆత్మానందానుభవము పొందయత్నించు

మూర్ఖులెప్పటికినీ తత్త్వ జ్ఞానమును పొందక, మాయకు, మలమునకు అతీతము, స్వప్రకాశవిరాజమూనము. సర్వపరిపూర్ణము ప్రపంచాతీతము. సకల సంసారదుఃఖ రహితము. భోదమాత్రమునైయుండు. స్వస్వరూపమేకాత్మను తెలియజాలరు-

***నాప్నోతి కర్మణామోక్షం విమూఢోభ్యాసరూపిణా।***

***ధన్యోవిజ్ఞానమాత్రేణ ముక్త స్తిష్ఠత్యవిక్రియః॥36***

యోగాభ్యాసాది కర్మలచేత మూర్ఖుడు మోక్షమును పొందజాలడు. అవిద్య, అజ్ఞాన, కామ్యకర్మల నిర్మూలించిన ధన్యుడు మాత్రమే ఆత్మవిజ్ఞానమును పొంది ముక్తిని లభింపజేసుకొనును.

***మూఢోనాప్నోతి తద్బ్రహ్మాయతో భవితు మిచ్ఛతి।***

***అనిచ్ఛన్నమపిధీరోహి పరబ్రహ్మస్వరూపభాక్॥37॥***

జ్ఞానికానివాడు చిత్త నిరోధాదుల వలననే బ్రహ్మత్వమును పొందగోరును. కానిమోక్షమును పొందలేడు. కాని చిద్రూపుడు మోక్షముపై కోరికలేకయే అతడు నిశ్చయముగ పరబ్రహ్మస్వరూపుడగును. అంతఃకరణముతో కూడినవాడు జీవుడు. కాని అటువంటి అంతఃకరణపై ఆవరణమే లేనివాడై అన్నిభావములను త్యజించినవాడు ఆత్మజ్ఞాని అతడు బ్రహ్మమేయగును.

***నిరాధారగ్రహ వ్యగ్రామూఢా స్సంసార పోషకాః।***

***ఏతస్యానార్థ మూలస్యమూలచ్ఛేదః కృతో బుధైః॥38॥***

అవిద్య, అజ్ఞానముతో కూడిన మూర్ఖులు సదభ్యాసములు లేనివారలై కేవలము చిత్త నిరోధము వలననే ముక్తిని పొందగలమను దురహంకారులై చావుపుట్టుకలతో కూడిన సంసారవృక్షనిర్మూలనకుపకరణమగు జ్ఞాన ఖడ్గమును పొందలేక యీ సంసారమను వృక్షమునే పెంపొందించుచుండెదరు. జ్ఞానులు మాత్రము యీ సంసారమనెడి వృక్షమూలమును జ్ఞాన ఖడ్గముచే నరికివేసి మోక్షప్రాప్తులగుదురు. అజ్ఞానము జనన మరణరూప సంసారవృక్షమునకు మూలాధారము కనుక దానిని మొదలంట నిర్మూలించుటయే మోక్షమని భావము.

***నశాంతింలభతేమూఢో యతశ్శమితుమిచ్ఛతి।***

***ధీరస్తత్త్వం వినిశ్చిత్య సర్వదాశాంత మానసః॥39॥***

ఆత్మతత్త్వముతెలియనివాడు చిత్తనిరోధాదులవలననే శాంతిని పొందగోరును. అతడే అజ్ఞాని. అతనికి శాంతి కలుగదు. జ్ఞాని ఆత్మ విశ్రాంతుడై అజ్ఞానముతొలగినవాడగుటచేత శాంతిని పొందవలయునను కొరికలేకయే స్వభావముచేతనే శాంతమనస్కుడగును.

***క్వాత్మనో దర్శనంతస్య యద్దృష్టమవలంబతే।***
***ధీరాస్తంత్వం నపశ్యంతి పశ్యంత్యాత్మనమవ్యయం॥40॥***

కళ్ళకు కనుపించువస్తువులను ఆపేక్షతో చూచువానికి, యింద్రియ వ్యవహారము స్థిరముగా ఉండుటవలన ఆత్మదర్శనము కానేరదు. జ్ఞానికి మాత్రము యిదిచీకటి, యిది వెలుతురు అనెడి దృశ్య బేధముండదు. అటువంటి జ్ఞాని కేవలము చిద్రూపాత్మనే చూచుచుండును.

***క్వ నిరోధో విమూఢస్యయో నిర్బంధంకరోతివై।***
***స్వారామస్త్వైవ ధీరస్య సర్వదా సావకృత్రిమః॥41॥***

సమాధి, చిత్తమును నిరోధించుట చేయు పామరునకు చిత్త నిరోధ మసలేకలుగదు. ఏలయన సమాధినుండి బయల్పడగనే ఎప్పటిలా అతనికి చిత్తచలనము, ప్రపంచ,పరిసర జ్ఞానముకలుగును. ఆకారణముగా ప్రయత్నముతో కూడిన మనోనిరోధము, సమాధియును అజ్ఞానకృత్యములే అగుచున్నవి. చిద్రూపునకు సర్వదా అప్రయత్నముననే మనోనిరోధము కలుగును. సచ్చిదానంద స్వరూపుడైన మహాత్మునకు చిత్తచాంచల్యమే లేకుండటచేత సమాధియు, మనోనిరోధమును ఆమహాత్మునకు స్వాభావికములే అవగలవు.

***భావ స్వభావకః కన్నిశ్చిన్న కించిత్ భావకోపరః।***
***ఉభయాభావకః కశ్చిదేవమేవని రాకులః॥42॥***

కొందరు తర్కవాదులు మనము భావించుచున్న యీ రూప ప్రపంచము మిథ్యయైనను, కారణపరమాణువులు సత్యముగుటవలన ప్రపంచము మిథ్యకాదనిచెప్పుదురు. నిరాశీర్వవాదులగు బౌద్ధులు "సర్వక్షణికం క్షణికం"అనగా అంతయూ రెండవక్షణములో ఉండదు. కనుక అంతయూ శూన్యమనియెదరు.కాని సహస్ర జనులలో ఆత్మానుభవానందమును పొందుజ్ఞాని మాత్రము యీ భావవాదమును, శూన్యవాదమును నిరాకరించి స్వస్థచిత్తుడు సర్వసాక్షియు. స్వయం ప్రకాశమానుడునైయుండును.

***శుద్ధ మద్వయమాత్మానాం భావయంతి కుబుద్ధయః।***
***నతుజానంతి సమ్మోహాః ఆద్వావజ్జీవమనిర్వృతాః॥43॥***

ఆత్మానుభవము లేని పామరులు ఆత్మ అద్వితీయము. సర్వవ్యాపకము నిర్మలము అనిమాత్రమే ఆలోచించెదరు, కాని ఆత్మసాక్షాత్కారమును పొందజాలరు. ఇందుకు కారణము మోహమే! నిర్మలత్వమనగా కల్పితములైన ఆణవిక, మాయిక, మామేయిక మలములు లేకుండా ఉండుట. అద్వయత్వమనగా కల్పించబడిన

యీ భౌతికవస్తుసముదాయరాహిత్యము సర్వవ్యాపకమును, స్వయంజ్యోతియునగు ఆత్మతత్త్వము యిది అని చూపుటకును, యిట్టి నామరూపముకలదని చెప్పుటకును అలవికానిదియు యితరాపేక్షలేనిదియు కల్పితములగు నామరూపములు ఆత్మకావని బోధింపబడుటచేత అనాత్మయే కల్పితమని యితర ఆపేక్షకలుగును. సాపేక్షరూపచింతనము వలన మోహము పెరుగునే కాని తొలగనందున అట్టి చింతనాపరులకు ఆత్మానుభవము లేదని చెప్పబడెను. కావున అటువంటివారలు అనగా ఆత్మయొక్క నిర్మలత్వాదులను గురించి మాత్రమే చింతించువారలు జీవితాంతమును నిర్వృతిలేమి సంతోషరహితలగుదురు. సద్గురువులు పదేశించినమార్గమున అనుభవయుక్త మగు జ్ఞానము వలననే పరమానంద ప్రాప్తి కలుగునని భావము.

***ముముక్షోర్బుద్ధిరాలంబమంతరేణ నవిద్యతే।***
***నిరాలంబైవ నిష్కామాబుద్ధిర్ముక్తస్స సర్వదా॥44॥***

అత్మసాక్షాత్కారములేని వానిబుద్ధి విగ్రహారాధనల నవలంబించు చుండును. చిద్రూపునియొక్క బుద్ధి నిరాలంబమైయుండును. అనగా ఆత్మసాక్షాత్కారము పొందని పామరుడు సంశయములకు లోనై శివకేశవాది రూప ధ్యానపరుడై తద్వారాముక్తిని పొందప్రయత్నించును కాని...! ఆత్మానుభవముగల జ్ఞాని ఆత్మేతరములను వేటినీ తలంచక సర్వదా చిద్రూపుడైయుండును.

***విషయద్వీపినోవీక్ష్య చకితాః శరణార్థినః।***
***విశంతి ఝటితి క్రోధం విరోధైకాగ్రసిద్ధమే॥45॥***

విషయవాసనలు తొలగని పామరులు మనోనిగ్రహమును పొందుట కొరకు పర్వతగుహలందువసింతురు. చిద్రూపులకు ఆవిధమైన అవసరములేదు. విషయవాసనలు తొలగని వారలు గృహములయందుండిన అవి హెచ్చుచుండునను భీతిచేత సాధుపుంగవులను వారి ఆశ్రయములను ఆశ్రయించి నిర్జనమైన అరణ్యములయందు. చేరుకొని అచటక్ర్రూరమృగములకారణంగా ప్రాణభయము కలుగకుండ గిరిగుహలయందు నివసించుచు మనోనిగ్రహ సాధన కొరకు ప్రాణాయామ లంబికాదియోగములను అభ్యసింతురు. అటువంటి వారలకుస్వగృహములలో విషయవాసనల భయము, అరణ్యములలో క్రురమృగముల వలన భయము, గుహలయందు విషకీటకములు, సర్పములు, వృశ్చికములు యిత్యాదుల భయము కలుగుచుండును. పైన ఉదహరించిన

భయములు లేకపోయినను చిత్త నిరోధ ప్రయత్నమునందు సందేహములు ఒకటి తర్వాత మరొకటి కలుగు అవకాశముండును. అటువంటి వారలకు మానసిక శాంతి లభించనందువలన ఆత్మదర్శనము జరుగుట ఎట్లు....?

**నిర్వాసనం హరింద్రుష్ట్వా తూష్ణీం విషయదంతినః**
**పలాయంతేన సక్తాస్తే సేవంతే కృతచాటవః॥46॥**

యేనుగులకు సింహములు భయకారణములైనట్లు విషయ వాసనాశూన్యులగు మహాత్ములచెంతకు విషయములు చేరలేవు. పలాయనము చిత్తగించగలవు. భర్తలను భయభక్తులతో సేవించు పతివ్రతలవలె అదృష్ట ప్రేరితములగు ఆవిషయములు వాసనలకు దూరమైనావానిని సమయ సందర్భోచితముగా చేరి వినయ భయభక్తులతో భజించగలవు

**నముక్తి కారికాంధత్తే నిశ్శంకోయుక్త మానసః**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యధాసుఖం॥47॥**

చలించని మనస్సుగల మహాత్ముడు నిస్సంశయుడై యమ నియమాది కర్మలతో సంబంధములేకయే లోకదృష్టికి చూచుట వినుట తాకుట, వాసనచూచుట, భుజించుట మొదలగునిత్యకృత్యములు నెరవేర్చుచున్నను. ఆయా పనులయందు కర్తృత్వాభిమానము లేకయే సదా ఆత్మదర్శనుడై యుండును.

**వస్తుశ్రవణమాత్రేణ శుద్ధ బుద్ధిర్నారామలః**
**నైవాచార మనాచార మౌదాస్యంవా ప్రపశ్యతి॥48॥**

అనేక గతజన్మలలో సంపాదించిన జ్ఞానాంకురము కలిగిన ఉత్తమ పురుషుడు సద్గురువుద్వారా తత్త్వమసి 'ప్రజ్ఞానంబ్రహ్మ' 'సర్వఖల్విదంబ్రహ్మ' యిత్యాది మహావాక్యములను వినినంతనే ఆత్మసాక్షాత్కారము కలిగి స్వస్వరూప స్థితుడగును. అటువంటి మహనీయుడు. తనే కేవల బ్రహ్మయగుటచేత కర్మలనాచరించుచు ఆచారవంతుడును కాడు, కర్మలను త్యజించి అనాచారియునుకాడు, ఈ రెండుకార్యములయందును. తటస్థ భావముతో నిష్కర్ముడునుకాడు. అనగా చిద్రూపునకు శుభాశుభకర్మలతో కాని నిష్కర్ముడై ఉండుటతోకాని ఏవిధమైన సంబంధములేదని భావము. నైష్కర్మ్యమనగా కర్మసాధ్యముగాక సిద్ధమయిన పరబ్రహ్మము.

***యదాయత్కర్తుమాయాతి తదావతత్కురుతే బుజుః।***

***శుభం వాప్య శుభం వాపితస్యచేష్టాహి బాలవత్॥49॥***

చిన్నపిల్లలు తమకు అపాయము కలుగునని తెలియక, దీపములు మొదలగు అపాయకర వస్తువులను తాకయత్నింతురు. చెడుపదార్థములచెంతకు చేరుదురు. ఒకప్పుడు ఆనందించెదరు. మరోకప్పుడేడ్చెదరు మిడుతలను, తూనీగలను చంపుదురు. హింసించెదరు, పాపమని తెలియక వీరిచేష్టలకు భావాభావములుండవు. అవిధముగనే చిద్రూపుడైన జ్ఞాని చిన్నపాపలవలెనే లోకదృష్టికి ప్రారబ్ధవశమగుకర్మములు చేయుచుండినను అవి కర్తృత్వాభిమానమునకు దూరమైయుండగలవు. అంతేకాక అవి పసిబాలుల చేష్టలవలె ఉండగలవు.

***స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లభతేపరమ్।***

***స్వాతంత్ర్యాన్నిర్వృతింగచ్ఛే త్స్వాతంత్ర్యాత్పరమంపదమ్॥50॥***

"స్వం" అనగా తాను (ఆత్మ) "పరం" అనగా అన్యము (అనాత్మ) యీ అనాత్మజడము, అనృతము,దుఃఖము. వీటికి వశమగుట పరతంత్ర దానికి వ్యతిరేకము స్వాతంత్ర్యము (ఆత్మాసాక్షాత్కారము) ఈ స్వాతంత్ర్యము వలన సుజ్ఞానము కలుగగా రాగద్వేషములు నశించును. ఈ రాగ ద్వేషములను చిత్తమలము లేకపోవుటయే మనః ప్రసాదము . కావున స్వాతంత్ర్యము వలన మనఃప్రసాదము ఆ పిమ్మట జ్ఞానము కలుగును. ఆ విధముగా స్వాతంత్ర్యము వలననే ఆత్మానంద సుఖముకలుగును. దాని వలననే స్వస్వరూప విశ్రాంతిలభించును.

***అకర్తృత్వ మభోక్తృత్వం స్వాత్మనోమన్యతేయదా।***

***తదాక్షీణా భవంత్యేవ సమస్తాశ్చిత్త వృత్తయః॥51॥***

జీవుడు తనకు కర్తృత్వభోక్తృత్వములు లేవని భావించినపుడే చిత్తవృత్తులన్నియు నశించును. ఈ ధర్మములు బుద్ధి సహితముగు జాగృత్స్వప్నావస్థలయందుండునుగాని బుద్ధిరహితమగు సుషుప్త్యవస్థలయందుండవు. కనుక రాగము యిత్యాది కోరికలు బుద్ధిధర్మములుగాని ఆత్మధర్మములుకావు. కావున బుద్ధి ధర్మములు తొలగినంతనే ఆత్మదర్శనము కలుగునని భావము.

***ఉచ్ఛంఖలాప్యకృతి కాస్థితిర్ధీరస్య రాజతే।***

***నతునస్పృహచిత్తస్య శాంతిర్మూఢస్వ కృత్రిమాః॥52॥***

తనుచేయు పనులయందు నిస్పృహుడై నిష్కపటవృత్తితోవిహరించుచు జనులదృష్టికి శాంతి లేని వానివలె వ్యవహరించినను జ్ఞానిపరబ్రహ్మస్వరూపుడై విలసిల్లును. కపటముతో శాంతియుతుడుగా ఉన్నట్లునటించు మూర్ఖుడు జ్ఞానివలె శోభిల్లడు.

*విలసంతి మహాభోగైర్విశంతి గిరిగహ్వరాన్।*

*నిరస్తకల్పనాధీరా అబద్ధాముక్త బుద్ధయః॥53॥*

సంకల్పవికల్పశూన్యుడగు జ్ఞాని ఒకప్పుడు ప్రారబ్ధలబ్ధ భోగములను భవించును. ఒకానొకప్పుడు ప్రారబ్ధవశములన పర్వతములయందు అరణ్య మధ్యములయందు సంచరించును. ఆ ధీరుడెట్లున్నను కర్తృత్వాభిమానము లేకుండ ఆసక్తిరహితుడై వృత్తి శూన్యుడైయుండును.

*శ్రోత్రియందేవతాం తీర్థమంగనాం భూపతిం ప్రియం।*

*దృష్ట్వా సంపూజ్యధీరస్యనకాపిహృదివాసనా॥54॥*

జ్ఞానితాను సచ్చిదానంద స్వరూపుడగుటవలన సర్వమును చిద్రూపాత్మయగు తానేయను దృఢనిశ్చయముతో సర్వత్రాసమచిత్తుడై ధర్మార్థకామ వాసనలు లేకయే యితరులను మన్నించును . దేవతలను పూజించును. రాజులను గౌరవించును. భార్యాపుత్రాదుల నాదరించును. లౌకిక వ్యాపారమందున్నను ఆ ధీరునకు ఆదరణాభావముకాని,అనాదరణా భావముకానిలేవు.

*భృత్యైః పుత్రకైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః।*

*విహస్యధిక్కృతో యోగీనయాతి వికృతిం మనాక్॥55॥*

చిద్రూపునకు రాగద్వేషములు లేనందున తనవారలైన భృత్యులు భార్యాపిల్లలు, మనవలు మనవరాండ్రు. తనను ధిక్కరించి అపహస్యముచేసినను మనోసంక్షోభమును పొందడు.

*సంతుష్టోపి నసంతుష్టః ఖిన్నోపి నచఖిద్యతే।*

*తస్యాశ్చర్యదశాం తాంతాం తాదృశాయేవజానతే॥56॥*

చిద్రూపుడైన జ్ఞానిలోకసామాన్యమునకు బాహ్యవిషయప్రాప్తివలన సంతుష్టుడైనట్లు కనుపించినను యదార్థముగా సంతోషికాడు బాహ్యవిషయ వియోగమువలన దుఃఖించినట్లగుపించిననుదఃఖితుడుకాడు. సర్వదా సచ్చిదానంద స్వరూపుడైయే యుండును.అటువంటి విజ్ఞానియొక్క చర్యలు తత్తుల్యులగు యితరజ్ఞానులే యెరుగుదురు.

*కర్తవ్యతైవ సంసారోనతాం పశ్యంతి సూరయః।*

*శూన్యాకార నిరాకారా నిర్వికారా నిరామయః॥57॥*

"ఈ కార్యమునేను నిర్వహించపలెను" అనుసంకల్పమే సంసార హేతువగువను. జ్ఞానులకు అటువంటి సంకల్పవే లేనికారణమున 'నిర్వహించవలె'నను కర్తవ్యతాజ్ఞానముండదు.. ఏలయనగా తత్త్వవేత్తలు ప్రపంచ

ప్రళయసమయమున సాక్షిగా మిగిలన చైతన్యమే జాగ్రదవస్థయందు. జడములగు దేహేంద్రియాదులను వ్యవహారికముగా చేయుచుండునని యెంచి, నిరాకారము నిర్వికారముయగు చైతన్యమే తానుగా భావించుటచేత సంకల్పములు మొదలగు వికారములులేనివారై ఆనందించెదరు.

**అకుర్వన్నపి సంక్షోభాద్వ్యగ్రస్సర్వత్రమూఢధీః।**

**కుర్వన్నపితు కృత్యాని కుశలోహి నిరాకులః॥58॥**

మూర్ఖుడు యేకార్యమును చేయక ఊరకుండినను. కనుపించు యీ వస్తువులసత్యమా..? కనుపించని వస్తువులు సత్యమా..? అని మనసులో తలచుకొనుచు దుఃఖపడును. జ్ఞాని అభావమాత్రములగు కార్యములను వ్యవహారదృష్టికి పామరులవలె చేయుచున్నను యీ దృశ్యజాలమంతయు అసత్యములుగా నమ్మి చిద్రూపుడై వెలయుచుండును.

**సుఖమాస్తే సుఖంశేతే సుఖమాయాతి యాతిచః**

**సుఖంసక్తి, సుఖంభుక్తే వ్యవహారేపి శాంతధీః॥59॥**

జ్ఞాని, ఆత్మవిదుడు ప్రారబ్ధకారణమైన కార్యముల నిర్వహించుచుండియు ఆత్మయందే రమించుచుండును. ఇంద్రియములన్నియు వాటి వాటి కార్యములను నిర్వర్తించుచుండగా వాటియందు యేవిధమైన కర్తృత్వభావము లేకుండా సచ్చిదానంద స్వరూపుడై విలసిల్లును.

**స్వభావాద్యస్యనై వార్తిర్లోకవద్వ్యవహారిణః।**

**మహాహ్రద ఇవాక్షోభ్యో గతక్లేశుస్సు శోభతే॥60॥**

సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మవిదుడు పామరుని వలె వ్యవహారమును నిర్వర్తించుచున్నను. సాంసారిక దుఃఖమును పొందడు. అటువంటి దుఃఖరహితుడగు చిద్రూపుడులోతైన చెరువు యొక్కనీరు చలించని విధముగా నిర్వికారుడై, నిశ్చలచిత్తుడై సంక్షోభములేక సర్వదా ఆత్మారాముడై శోభిల్లును.

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే।**

**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తి ఫలభాగినీ॥61॥**

అహంకారమమకారములు కలిగిన పామరుడు నలుగురు మెచ్చుకొనవలయునని బాహ్య, అంతరింద్రియ వ్యాపారములను విసర్జించిన వానివలె నటించుచుండినను వాని చిత్తవృత్తి ప్రవృత్తునివలె నేయుండును. జ్ఞాని ప్రారబ్ధలబ్ధమగు కర్మలుచేయుచు. వ్యవహార దృష్టికి ప్రవృత్తినువలె

ప్రవర్తించినప్పటికి అతనికి కర్తృత్వాభినము లేదు కనుక ఆతని ప్రవృత్తి నివృత్తి యేయై ముక్తి కారణమగును.

**పరిగ్రహేషువైరాగ్యం ప్రాయోమూఢస్య దృశ్యతే।**
**దేహేవిగళితాశస్య క్వరాగః క్వవిరాగతా॥62॥**

దేహేంద్రియాదులయందు అనురాగమును, ధనముయందు, వేశ్యలతో పొందు సుఖమునందును, ఒక్కొక్కప్పుడు వైరాగ్యము కనుపించును. అటువంటి వైరాగ్యము సాంసారికయిబ్బందులవలన కలుగునదియే కాని జ్ఞానజన్య విరక్తికాదు దేహవాసనకలిగియుండుటచేత అటువంటివైరాగ్యము మరల అనురాగముగా మారగలదు. దేహేంద్రియాదులయందభిమానమే లేని చిద్రూపునకు దేహమునకు సంబందించిన పుత్రుడు, బార్య, గృహము, ఆస్తిపాస్తులయందునురక్తియే కలుగదు. అవిధముగనే శత్రువులయందు, క్రూరమృగములైనపులి, సింహము, సర్పములయందు విరక్తియు కలుగదు. తనదేహమును గురించిన రాగవిరాగములేలేనప్పుడు ఆదేహసంబంధమగు విషయములందు రాగవిరాగములుండునా...? ఉండవు.

**భావనా భావనాసక్తా దృష్టిర్మూఢస్య సర్వదా!**
**భావ్యభావనయాసాతు స్వస్థస్యాదృష్టిరూపిణీ॥63॥**

పామరుని దృష్టిఎల్లప్పుడును భావములయందు అభావములయందు అనురక్తమై యుండును. అటువంటివాడు నేను భావనలో నిమగ్నుడైనాను. లేదు. అనెడి అహంకారయుతుడై యుండును. అనగా వాడిమనస్సు ఆత్మకు యితరములగు వస్తు సముదాయమందు ఆసిక్తి కలిగినదైయుండును. గాని స్వస్వరూపదర్శనమందు నిమగ్నముకాదు. కావున అది వ్యర్ధముకాని ఆత్మవిదుని దృష్టి వస్తు సముదాయములయందు లగ్నమైయున్నను. దృశ్య దర్శనాభిలాషా శూన్యమేయై ఉండును. అనగా తనయెదురుగా ఉన్నవస్తువును చూచుచున్నను ఆత్మదృష్టిచే దానిని చూడనివాడే యగును.ఏలయనగా ఆ జ్ఞాని ఎల్లప్పుడు స్వస్వరూపమునందే ఆరూఢుడైయుండుటచేత అతనికి ఆత్మ తప్ప యితరవస్తువులు గోచరింపవు.

**సర్వారంభేషు నిష్కామోయశ్చరే బాలవన్మునిః**
**నలేపస్తస్య శుద్ధస్య క్రియమాణేపి కర్మణి॥64॥**

చిద్రూపుడు యెటువంటి సంకల్పములు లేకుండా కోరికలయందు మమకారములేనివాడై ప్రారబ్ధవశమగు సర్వకార్యములుచేయుచుండును. ఆతని మానసిక స్థితి పసిపాపచిత్త స్థితిని పోలియుండును. అట్టిపరిశుద్ధుడగు జ్ఞాని ఏమిచేయుచున్నను కర్తృత్వము లేకయే చేయుచుండును కావున ఆతనికి ఆ కర్మసంబంధమైన లేపముండదు.

**సపవధన్య ఆత్మజ్ఞ స్వర్వభావేషు యస్సమః**
**పశ్యస్సృణ్యాన్ స్పృశన్జిఘ్నన్నశ్నే న్నిస్తర్షమానసః॥65॥**

జ్ఞానియేధన్యుడుగాని యితరులుకారు. ఆమహాత్ముడు సర్వవస్తు సముదాయములందును. సర్వజీవరాసులయందును ఆత్మభావనచే సమబుద్ధి కలిగి వానినన్నింటినీ ఆత్మస్వరూపముగనే గాంచును. మరియు చూచుట, వినుట తాకుట, భుజించుట మొదలగు సమస్త క్రియలను తృష్ణారహితుడై, అహంభావ శూన్యుడై సలుపుచుండును.

**క్వసంసారః క్వచాభాసః క్వసాధ్యం క్వచసాధనం।**
**ఆకాశస్యే నధీరస్య నిర్వికల్పస్య సర్వదా॥66॥**

ఆకాశమువలే ఉపాధిశూన్యమూ సర్వ పూర్ణుడై యుండు జ్ఞానికి సంకల్ప, వికల్పములు లేనందున యీ ప్రపంచమును లేదు. సంసారాది భ్రమలును లేవు. సంసారివలె ప్రవర్తించుచున్నను. సంసారికాడు. పరముఉత్కృష్టమగు జీవన్ముక్తస్థితిలో ఉండుటచేత ఆతనికి స్వర్గము, తత్కారణములగు యజ్ఞములు అక్కరలేదు.

**సజయత్యర్థ సంన్యాసీ పూర్ణస్వరసనిగ్రహః**
**ఆకృతిమోవచ్ఛిన్నే సమాధిరస్య వర్తతే॥67॥**

జ్ఞాని దృష్టాదృష్టములతో ప్రయోజనములేని వాడుకావున అర్థసంన్యాసి. అనియు, పూర్ణస్వభావమే స్వరూపముగా కలవాడు గనుక 'పూర్ణ స్వరవిగ్రహు' డనియు తలంచబడును. పరిపూర్ణత్వమేఆమహనీయునకు సమాధి. ఆ మహాశయుడు తప్పక మోక్షక సామ్రాజ్యమున జయముగాంచును.

**బహూనాత్రకిముక్తేన జ్ఞాతతత్వోమహాశయః**
**భోగమోక్ష నిరాకాంక్షీ సదా సర్వత్రనీరసః॥68॥**

జ్ఞానిని గురించి యెన్నోమాటలు చెప్పనేల.....? చిద్రూపుడగు మహాశయుడు భోగ మోక్ష ఫలములందాకాంక్ష లేనివాడు. వాటియందు అనురాగము కూడా లేనివాడు.

**మహదాది జగద్వైతం నామమాత్ర విజృంభితమ్।**
**విహాయ శుద్ధబోధస్య కింకృత్యమవశిష్యతే॥69॥**

కుండలు, మూకుళ్ళు,ముంతలు మొదలగు వస్తుసముదాయమంతయు

వాటి నామరూపములతో పిలువబడినను అవన్నియూ మట్టిముద్దనుండియే కలిగినవికావున మట్టి మాత్రము సత్యము. రూపములన్నియును అసత్యములు. ఆవిధముగనే అహంకారము మొదలు శబ్ద స్పర్శ రూప, రస గంధములనెడు పంచ తన్మాత్రలు వాటికధిష్టానములగు పంచభూతములతో కల్పితమైన యీ జగత్తంతయు నామమాత్రమైనదికాని వాస్తవమైనదికాదని తెలుసుకొని దీనికధిష్ఠానము పరిపూర్ణమునగు స్వప్రకాశ చిన్మాత్ర స్వరూపుడైయున్న మహాత్మునకు యికచేయు కృత్యమేమున్నది.

***భ్రమభూతమిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ।***
***అలక్ష్య స్ఫురణ శ్శుద్ధ స్స్వభావేనైవ శామ్యతి॥ 70॥***

చిద్రూపుడైన జ్ఞాని, సర్వమూ భ్రమచేత కల్పించబడినదేకాని యెంతమాత్రము వాస్తవముకాదని నిశ్చయముగలవాడు. ఈ దృశ్యమంతయు కల్పితమని నిర్లక్షించి సచ్చిదానంద స్వరూపుడై విలసిల్లును. జ్ఞానసముపార్జనకు జ్ఞానముకంటే యితరమగు ప్రయత్నమేదియు జేయనక్కరలేదు.

***శుద్ధస్ఫురణరూపస్య దృశ్యభావవశ్యతః।***
***క్వవిధిః క్వచవైరాగ్యం క్వత్యాగః క్వశమోపివా॥ 71॥***

చిద్రూపుడై దృశ్యపదార్ధమేదియును గోచరింపకుండనట్టి జ్ఞానికి కర్మానుష్ఠాన విధియూ లేదు. విరక్తిపొందతగిన విషయమునులేదు. త్యజించగ తగినదికాని. పరిగ్రహించ తగినదిగాని యేదియునులేదు.

***స్ఫురతోనంతరూపేణ ప్రకృతించన పశ్యతః।***
***క్వబంధః క్వచవా మోక్షః క్వహర్షః క్వవిషాదితా॥ 72॥***

సచ్చిదానంద స్వరూపుడైనమహాత్మునకు పంచభూతకల్పితసంసారము యొక్క స్పృహ యుండదు. అటువంటి నిర్మలజ్ఞానికి బంధమోక్షములు హర్షవిషాదములుకూడా ఉండవుకదా...?.

***బుద్ధిపర్యంత సంసారే మాయామాత్రం నివర్తతే।***
***నిర్మమో నిరహంకారో నిష్కామశ్శోభతే బుధః॥ 73॥***

ఆత్మజ్ఞానముచేత నశించు యీ సంసారము. రజ్జువునందు సర్పభ్రాంతివలెనే విచారణ పిమ్మట అంతరించుచున్నది. (భ్రాంతి అంతరించి యదార్థము గోచరించుచున్నది). అటువంటి యీ జగత్తు భ్రమమాత్ర

స్వరూపమైనదేకాని సత్యముకాదు. కావున బుధులు అతాత్వికమగుయీ శరీరమందు అహంకారమును తత్సంబంధిత దారాపుత్రాదులయందు మమకారము లేకుండ చిద్రూపులై విలసిల్లుదురు.

*అక్షయం గతసంతాపమాత్మానం పశ్యతోమునేః*
*క్వవిద్యాచ క్వవావిశ్వం క్వదేహోహం మమేతివా॥74॥*

నాశనములేనిది, సర్వసంతాపరహితమైనది యగు ఆత్మవిదునకు ఆత్మాతిరిక్తములగు శాస్త్రవిమర్శనము, ప్రపంచము, దేహము, అహంకార మమకారములు మొదలగు వానితో పనిలేదు.

*నిరోధాదీనికర్మాణి జహాతి జడధీర్యది,*
*మనోరథాన్ప్రలాపాంశ్చ కర్తుమాప్నోత్యతత్క్షణాత్॥75॥*

జడుడు చిత్తనిరోధాదులు చేయుగాక ఆ చిత్త నిరోధాదిక్రియ ఆపిన వెంటనే తన మననునకు నచ్చినకార్యములు నెరవేర్చుకొనుటకై సర్వవ్యవహారములను నిర్వహించుచుండును. కాబట్టి మూఢునిచిత్తనిరోధాది కర్మములు కుంజరస్నానము (ఏనుగుస్నానము)వలె నిష్ప్రయోజనములు. (ఆసన ప్రాణాయామ, జపాద్యనుష్ఠానములవలన చిత్తశుద్ధిమాత్రమే కలుగునుగాని ఆత్మజ్ఞానము కలుగదని భావము).

*మందశ్రుత్వాపి తద్వస్తునజహాతి విమూఢతాం,*
*నిర్వికల్పో బహిర్యత్నా దంతర్విషయలాలసః॥76॥*

ఆత్మతత్త్వస్వరూపమును తెలుసుకొనికూడను మూర్ఖుడు తన మూఢత్వమును విడువలేడు. ఏలయనగా చిత్తము మలినముగా ఉన్నవారలకు శ్రవణాదులవలన జ్ఞానమావిర్భవించదు. అందువలన మూర్ఖుడు చిత్త నిరోధాదిప్రయత్నములచేత లోకదృష్టికి వ్యాపారములేనివాడై కనుపించినను మనసులో విషయములు అతనిని చలింపచేయుచునేయుండగలవు.

*జ్ఞానద్గలిత కర్మాయో లోకదృష్ట్యాపి కర్మకృత్,*
*నాప్నోత్యవసరకర్తుం వక్తుమేవ కించన॥77॥*

కర్తృత్వాధ్యాసములేని జ్ఞాని నలుగురి దృష్టికి వ్యవహరములు సలుపుచున్న వాడుగా ఉండినను నేను యీ పనిని నిర్వహించుచున్నాను. అను అహంకారమునకు అవకాశమివ్వక సర్వదా చిద్రూపుడై వెలయుచుండును.

*క్వతమః క్వప్రకాశో వాహానం క్వచన కించన,*

*నిర్వికారస్య ధీరస్య నిరతాం కస్యసర్వదా॥78॥*

చిత్తవికారములు తొలగిన జ్ఞానికి, అజ్ఞానమే లేనప్పుడు అజ్ఞానమును తొలగించు జ్ఞానమెందులకు...? త్రికాలములను గురించి భయమేలేనివానికి విడువతగినదేది...? అనురాగాది వృత్తులే లేనివానికి కోరతగినదేది....? అనగా చిద్రూపునకు జ్ఞాన,అజ్ఞానతారతమ్యము, కాలనియమము, హేయోపాదేయములును లేవని భావము.

*క్వధైర్యం క్వవివేకత్వం క్వనిరాతం కతాపివా,*

*అనిర్వాచ్య స్వభావస్య నిస్స్వభావస్య యోగినః॥79॥*

ఏ విధమైన స్వభావమునులేక యిటువంటిదని నిర్ణయించుటకు వీలుగాని జ్ఞానికి ధైర్యము, వివేకము,నిర్భయముయిత్యాది ధర్మములుకూడా లేవు.

*నస్వర్గోనైవ నరకో జీవన్ముక్తిర్న చైవహి,*

*బహునాత్ర కిముక్తేన యోగదృష్ట్యా నకించన॥80॥*

చిద్రూపునకు స్వర్గ నరకములలేవు. జీవన్ముక్తియునూ లేదు. ఇవన్నియు భ్రాంతి రూపములేకాని వాస్తవములు కావు. సచ్చిదానంద స్వరూపుడగు జ్ఞానిలోకదృష్టికి జీవన్ముక్తుడై యుండును. జీవము-ముక్తియూ భ్రమలేకనుక జ్ఞాని వీనిని ఆదరింపడు.

*నైవప్రార్థయతేలాభం నాలాభే నాను శోచతి,*

*ధీరస్య శీతలం చిత్త మమృతేనైవ పూరితమ్॥81॥*

చిద్రూపునియొక్క మనసు శీతలమై, ఆధ్యాత్మికాది తాపత్రయ రహితమై ఎల్లప్పుడునూ పరమానంద భరితమైయుండుటచేత దేహధారణకై ఏమీ కోరడు. లభించని యెడల విచారించడు.

*నశాంతం స్తౌతి నిష్కామో నదుష్టమపి నిందతి,*

*సమదుఃఖ సుఖిస్తృప్తః కించి త్కృత్యం నపశ్యతి॥82॥*

ఏ విధమైన కోరికలు లేని చిద్రూపుడు శాంత్యాది శుద్ధసత్త్వగుణ సంపద గలవారినిస్తుతించడు. దుష్టులైనవారు తనను ఎంతగా హింసించిననూ వారలను నిందించడు. సదాతృప్తినిపొందుచు. సుఖదుఃఖముల రెండింటిని సమానముగా గాంచును.

*ధీరోనద్వేష్టి సంసారమాత్మానాం న దిదృక్షతి।*
*హర్షామర్షవినిర్ముక్తో నమృతో నచజీవతి॥83॥*

జ్ఞానిలోకదృష్టిలేక లోకబాధను గమనించనివాడు గనుక లోకమును ద్వేషింపడు. ఆత్మసాక్షాత్కారము కలిగినవాడగుటచేత వానిని ఆదరించడు. అనగా జీవించవలయునను కోరికగాని, మరణించెదనను భయములేనివాడని భావము.

*నిస్స్నేహః పుత్రదారాదౌ నిష్కామో విషయేషుచ।*
*నిశ్చింత స్స్వశరీరేపి నిరాశ శ్శోభతే బుధః॥84॥*

చిద్రూపుడు దారాపుత్రాదులయందు ప్రేమలేకయు, సర్వ విషయముల యందు కోరికలేకయు, దేహాభిమానము సైతము లేనివాడగుటచేత భోజనాది చింతయునులేక సర్వదా ఆశాశూన్యుడై శోభించును.

*తుష్టి సర్వస్య ధీరస్య యధాపతిత వర్తినః।*
*స్వచ్ఛందం చరతో ధేశాన్యత్రా స్తమిత శాయినః॥85॥*

ఇది మంచిది, యిదిచెడ్డది. అని విమర్శింపక ప్రాప్తమగు దానిననుభవించు మహాత్ముడు జ్ఞాని. నిత్యసంతోషియై, యెటువంటి కోరికలు లేనివాడై, స్వేచ్ఛాప్రవృత్తులతో ప్రారబ్ధము కొనిపోవు ప్రదేశములందు. చరించుచు అరణ్యమందైనను, పట్టణ మందైనను ఎచట సూర్యుడస్తమించునో. అచటనే శయనించుచు, ఆత్మారాముడై విలసిల్లును.

*పతతూదేతు వాదేహో నాస్యచింతామహాత్మనః।*
*స్వభావ భూమివిశ్రాంతి విస్మృతాశేష సంసృతేః॥86॥*

తన ఆత్మ స్వరూపమే అధిష్టానముగా అందు విశ్రాంతి చెందిన, అనగా స్వస్వరూపములో లీనమైయున్న జ్ఞానికి శరీరము ఉన్నను, నశించిన చింతలేదు.

*అకించనః కామచారో నిర్ద్వంద్వశ్ఛిన్న సంశయః।*
*అసక్త స్సర్వభావేషు కేవలో రమతే బుధః॥87॥*

చిద్రూపుడు తాను పరిగ్రహించునదేదియులేని వాడగుట వలన 'అకించను' దనబడి, విధి నిషేదములు లేని స్వేచ్ఛావిహారి యగుటచేత కామచారి అనబడి, సుఖము, దుఃఖము యిత్యాదులు లేనివాడై రెండవ వస్తువు లేదను దృఢనిశ్చయము కలవాడై, ఆత్మకంటేవేరు వస్తువు లేదని గ్రహించిన నిస్సంశయుడై అన్ని విషయములందును కోరిక లేనివాడై (సంగ్రహితుడై) నిర్వికారుడై, విరాజిల్లును.

**నిర్మమశ్శోభతే ధీరసమలోష్టాశ్మ కాంచనః**
**సుభిన్న హృదయగ్రంధిర్వినిర్ధూత రజస్తమః॥88॥**

అంతేకాక చిద్రూపుడు తన సద్గురువు ప్రసాదించిన జ్ఞానబలము చేత హృదయగ్రంధి విభేదింపబడిన వాడై (అహంకారమమకారశూన్యుడై) మట్టిని బంగారమును సమ బుద్ధితో చూచువాడై, ఆశాశూన్యుడై, అజ్ఞానకారణములగు రజోగుణ, తమోగుణములు లేనివాడై శోభిల్లును.

**సర్వత్రానవధానస్య నికించి ద్వాసనాహృది**
**ముక్తాత్మనో వితృప్తస్యతులనాకేన జాయతే॥89॥**

అన్నివిషయములందు మనసు పెట్టనివాడై, హృదయమందు నిర్వాసనుడై, కర్తృత్వాధ్యాసమేలేక కేవలము ఆత్మానందముచేత మాత్రమే తృప్తుడై యుండు చిద్రూపునితో సమానమైనవాడెవడునూ లేడు.

**జానన్నపి నజానాతి పశ్యన్నపి నపశ్యతి**
**బ్రువన్నపి నచబ్రూతే కోన్యోనిర్వాసనాధృతే॥90॥**

దేహేంద్రియ వాసనలులేని చిద్రూపునివలె అన్యులెవరును ప్రపంచదృష్టికి మనసా తెలిసియుతెలియు కుండగను, కనులతో చూచియు చూడకుండగను, నోటితో మాట్లాడియు మాట్లాడనివాడుగను వర్తించెదరు...? జ్ఞానికి సరితూగగలవాడు జ్ఞానియే..! అన్యులెవరును సరితూగరు ఇదియే జ్ఞానికి అజ్ఞానికి గల తారతమ్యము.

**భిక్షుర్వా భూపతిర్వాపి యోనిష్కామస్య శోభతే**
**భావేషు గళితాయస్య శోభనా శోభనామతిః॥91॥**

ఏ జ్ఞాని ఉన్నతపదవియందు ప్రేమయు. నీచ పదవిలేక తుచ్ఛవస్తువుల యందు నిరసనయు లేక కామరహితుడై ఉండునో అట్టివాడు రాజ్య భారము వహించియున్నను. భిక్షుకవృత్తి నవలంభించినను తప్పక శోభిల్లును. అట్టివారికి సంకల్ప వికల్పములు లేకపోవుటచేత రాజ్యపాలనము భిక్షుక వృత్తి రెండునూ బంధకారణములు కావనుట సర్వవిదితము.

**క్వస్వాచ్ఛంద్యం క్వసంకోచః క్వవాతత్త్వవినిశ్చయః**
**నిర్వ్యాజార్జవ భూతస్య చరితార్థస్య యోగినః॥92॥**

సచ్చిదానంద స్వరూపుడు, సర్వభూతములయందు సమత్వముకలిగి నటువంటి పరిపూర్ణుడునుయగుజ్ఞానికి స్వేచ్ఛాచారముగాని, నియమముగాని.

కర్తృత్వాధ్యాసముగాని ఉండవు. సమత్వమనగా సర్వభూతములయందు ఆత్మమాత్రావలోకనము.

*ఆత్మవిశ్రాంతితృప్తేన నిరాశేన గతార్తినా,*

*అంతర్యమనుభూయేత తత్కథం కస్య కథ్యతే॥93॥*

ఆత్మవిశ్రాంతిచేత తృప్తుడై, ఆకాశరహితుడై, ఆర్తిచెందని జ్ఞాని తన అంతఃకరణమందనుభవించు ఆనందము యిట్టిదియని వర్ణింప నెవరితరము? అటువంటి మహనీయునిబోలు మరియొకరికే తెలియును.

*సుప్తోపి నసుషుప్తౌచ స్వప్నోపి శయితోనచ,*

*జాగరేపి నజాగర్తి ధీరస్తృప్తః పదే పదే॥94॥*

ఎల్లవేళలను ఆనందానుభూతిలో మునిగియుండుయోగి జాగ్రత్త స్వప్న సుషుప్త్యావస్థలు కలిగియున్నట్లు కనుపించినను అతడావస్థాత్రయమునకు సాక్షిమాత్రుడేకాని వానికవి లేవు.

*జ్ఞస్సచింతోపి నిశ్చింతఃసేంద్రియోపి నిరీంద్రియః,*

*సుబుద్ధిరపి నిర్బుద్ధిస్సాహంకారో నహంకృతిః॥95॥*

చిద్రూపుడు చింతాది అవస్థలతో యింద్రియ వ్యాపారముచేయుచున్నను బుద్ధి ప్రేరితుడై యింద్రియములకు వశుడైనట్లు నలుగురికి కనుపించినను అహంకారము త్యజించినవాడుకనుక అట్టి చింతాదులతోకూడిన వ్యవహార స్ఫురణములేనివాడు.

*నసుఖీనచవా దుఃఖీ నవిరక్తోనసంగవాన్,*

*నముముక్షుర్నవాముక్తో నకించిన్నకించన॥96॥*

సచ్చిదానంద స్వరూపునకు అంతఃకరణ ధ్యాసమేలేదు. కావున లౌకిక సంబంధమైన సుఖము, దుఃఖము కలిగియున్నట్లు కనిపించినను ఆ సుఖ,దుఃఖాదులు ఆ మహాత్మునకు లేవు. విషయయులయందు ద్వేషభావము లేని వాడునుగనుక విరక్తుడునుకాడు. అంతకు ముందే బంధ రహితుడగుటచేత యిపుడు ముక్తుడును కాడు. ఆత్మనామరూపక్రియాశూన్యమైనదియు నిత్యమైననదియు కావున అనిర్వాచ్యమైనది. జ్ఞాని అటువంటి స్థితియందు (వచించుటకు శక్యముకాని) ఉండువాడుకనుక (నకించిన) ఏమియును కానివాడైయున్నాడు.

*విక్షేపేపిన విక్షిప్తస్సమాధౌ నసమాధిమాన్,*

*జాడ్యేపి నజడోధన్యః పాండిత్యేపి నపండితః॥97॥*

స్వస్వరూపసందర్శనము కలిగిన ధన్యుడైన మహనీయుడు నలుగురికీ లోకవ్యవహారయుతుడై ఆత్మచలనము కలిగినట్లుండినను, అదిలేనివాడై సంఘ

దృష్టికి సమాధిస్థితుడై యుండినట్లగుపడినను కర్తృత్వ భోక్తృత్వధ్యాసము లేనివాడు కనుక సమాధిపరుదునూకాడు. జడునివలె లోకదృష్టికి తోచినను ఆత్మనిష్ఠుడగుటచే జడుడునూకాడు. పరిపూర్ణపాండిత్యము కలిగిన వాడయ్యును "నేను పండితుడను" అను అహంకారములేని వాడుకనుక పండితుడునుకాదు.

***ముక్తోయధాస్థితి స్వస్థః కృతకర్తవ్య నిర్వృతః।***
***సమస్సర్వత్ర వైతృష్ణాన్న స్మరత్య కృతం కృతమ్॥98॥***

చిద్రూపుడు ప్రారబ్ధవశమున సంభవించు సుఖదుఃఖాదులునను భావించుచుండియు ప్రశాంత చిత్తుడైయుండును. ఇది చేయవలెను. అది చేయను అను పట్టుదలగాని కోరికగాని లేనివాడు కనుక తానుచేసిన చేయబోవు కార్యములందును బంధములేకుండా ఉండును. మరియు ఆశ లేనివాడగుటచేత యిదిచేసినాను, యిదిచేయలేదు అని ఆలోచించకుండా ఉండును.

***నప్రియతే వన్ద్యమానో నిన్ద్యమానోనకుప్యతి।***
***నైవోద్విజతి మరణే జీవనే నాభినందతి॥99॥***

సచ్చిదానంద స్వరూపుడగు జ్ఞాని యితరులు తనను పొగిడినప్పుడు సంతోషించడు. నిందించినచో కోపించడు. ఆత్మనిత్యమని తెలిసినవాడుకావున మరణము సమీపించినను యీ శరీరము అనిత్యమని తెలిసినవాడు గనుక భయపడడు. దుఃఖపడడు. జీవించియున్నందులకు ఆనందించడు.

***నధావతి జనాకీర్ణం నారణ్యముపశాంతధీః।***
***యధాతథా యత్రతత్ర సమయేవావతిష్ఠతే॥100॥***

స్వస్వరూప దర్శనమొందిన జ్ఞాని యెక్కడనున్నను? ఏవిధముగాన్నను..? సర్వదా ఆత్మసాక్షాత్కారము కలిగినవాడగుట చేత జనసమ్మర్ధముగల ప్రదేశమునుండి తొలగడు. సర్వ త్రశాంతి కలవాడగుటచే నిర్జనారణ్య ప్రదేశముకోరడు. అధిక జనావళికల నగరమందుండినను. జనశూన్యమైన అరణ్యప్రాంతమందుడినను, ఎక్కడ ఉండినను చిద్రూపుడగుటచే ఎల్లప్పుడును ప్రశాంత మనస్కుడై యుండగలడు.

**శాంతి శతకము**

**18 వ ప్రకరణము - సమాప్తము**



